శ్రీరస్తు.

684

# మా ని నీ మ ణి.

353.

ఇది

పనప్పాకము - శ్రీనివాసాచార్యులు(బిఏ)గారిచే

రచితమైన పద్యకావ్యము.

894.8131
SRI-M

శ్రీవైజయంతినుండి తత్పత్రికాధిపతుల యనుమతిచేఁ

బునర్ముద్రితమైనది.

చెన్నపురి:

శ్రీవైజయంతిముద్రాశాలలో

ముద్రితము.

1897

వెల ౧ అణా.

శ్రీరస్తు. 684

# మానినీమణి.

ఇది

పనప్పాకము - శ్రీనివాసాచార్యులు(బిఏ)గారిచే

రచితమైన పద్యకావ్యము.

894.8131
SRI-M

శ్రీవైజయంతినుండి తత్పత్త్రికాధిపతుల యనుమతిచేఁ

బునర్ముద్రితమైనది.

చెన్నపురి:

శ్రీవైజయంతిముద్రాశాలలో

ముద్రితము.

1897

వెల ౧ అణా.

శ్రీరస్తు.

# మానినీమణి.

---

ఆ,వె. ఈ నగంబుపైన నెంతయుఁ దెగువన్నై
నిట్లు నిల్చి బయల నీక్షణంబు
నిలిపి యట్టె చూచి యులుకు నీ చెలువ యి
ష్వనికి సతియొ యేల పదరు నొక్కొ? 1

తే,గీ. తన్ను వెన్నాడు చిఱుతలఁ దలిరుబోణి
చూచి కంపించి మగుడఁ దాఁజూచు బయల
నకట! దుఃఖంబు మోమున నలముకొనఁగ;
నిట్టులాబొలురను గాంచి యేల యడలు? 2

క. ఆహా! కొండల నటియున్
బాహాటంబుగ నెగడెడు పటుభీకరమా
నాహవమును గని తానిటు
రాహువదనగతశశి యన భ్రమందెడునొక్కొ? 3

తే,గీ. దీని కేఁక సందియంబేమి? తెల్లనైన
యల్లకేతనంబొకసమందుఁ బవన
చాలితంబుగా నెంతయు సంతసంబు
మోమునఁ జెలంగ నానందమునను జూచు. 4

క. అటుగాకది కన్నులకున్
దటుకునఁ గానఁబడనియెడఁ బల్లవ మొందున్

గుటిలాలక, యదియేలొకో
కటకట! యీ సతిమగఁడలకలనన్ గలఁడో? 5

క. అట్టులె యుండం బోలును;
గట్టులుకన్ వైరిసేనఁ గదనమునందున్
మట్టఁగ వచ్చిన పతికిన్
గట్టఁడు లవు లేమి సేయఁ గడఁగెద నొక్కో. 6

క. అని యెదఁ బొగులుచు నాతని
ననిఁ జూడఁ దలంచి పడఁతి యట నిల్చెనొకో?
మనమున భయములు నిగుడఁగఁ
దనయుల బాధలఁ గనంగఁ దరుణికి నగునే? 7

ఉ. తల్లి! యిదేల మమ్ము నురుదారుణకంటకసంవృతావనిన్
డిల్లపడంగఁ జేసెదవు, డించెదవె యక్కటికం బటంచు సం-
ఫుల్లముఖాబ్జము ల్వనటఁ బొల్పుల వీడఁగఁ బల్కువారొ నా
నల్లనఁ దల్లిఁ గన్గొనుచు నక్కట! కుందెద రెల్ల బాలకుల్. 8

ఆ, వె. చీర కొంగుఁ బట్టి చెలిమిమై నల్లన
లాగుబాలురఁ గని లలన చింత
గూరు నకట! వారి కేరీతిఁ దెలియును
దల్లియెడఁదఁ గలుగు తల్లడంబు. 9

క. అరులచె పరుగిడువారలు,
కరమును మింటన్ ధ్వజమది కాంతుల నీనన్,
దరుణియు సంతస మెడఁదఁ గ
దుర మందస్మిత మలరఁగఁ దులుతునఁ జూచెన్. 10

తే,గీ. “అరులు పాఱిరి, నాప్రియుఁ డురుజయంబు
నొందె, శ్రీనాథు కరుణచే నొనరె నేఁడె
నాకు మాంగల్యవిభవంబు, నాదుకుఱ్ఱ
లకును దమతండ్రి కౌఁగిలి లబ్ధ మయ్యె”. 11

సీ. అని యాసతీమణి మనమునఁ దలపోసి మోదమాననమున మొలకలెత్తఁ
జిన్నికుఱ్ఱలఁ జూచి చెలువాఱుప్రీతిమైఁ గదియంగఁ జేయుచుఁ గౌఁగిలించి
హృదయంబుకరుణచే నెంతయుఁ గరఁగనోయనఁగన్నుఁగవబాష్పములముకొనఁగ
గోటఁ గన్నీటిని మీటి పైఁటచెఱంగుచేఁ గన్నులఁ దుడిచి చెలిమి వెలయఁ
జటియలోఁ దననాథుని జాడ నెఱుఁగ
లేక కన్నులు విచ్చి యాలేమ నల్ల
డలను బరికించి పరికించి కలను విచ్చి
యునికిఁ గన్గొని పతిఁ జేర నున్నయెడను. 12

తే,గీ. కదనరంగంబు విడనాడి పదరి పాఱు
వైరివాహిని నొక్కఁడు భూరిబలుఁడు
పటుతరంబులౌ నారాచపటలి వింటఁ
గూర్చి యేయుచు నవివచ్చెఁ గొండదరికి. 13

క. మిలమిలమను కాంతు లడరఁ
బ్రళయాగ్నిచ్ఛటలఁ బోలి పటుతరతాపం
బలమఁగ దిశలన్ వచ్చెను
లలితాంగిదరికి ములుకులు లాఘవ మొసరన్. 14

ఉ. అక్కట! పుష్పముం దెగడు నందము మార్దవముం జెలంగఁ బెం
పెక్కిన యీ సతీమణికి నేగతి నిక్కటుమార్గణాళిచేఁ

జిక్కక నిల్వఁబోలు నిఁకఁ, జిన్నికుమారులఁ బ్రోచువారు లే
రిక్కడ,వీరిఁ గూల్చనొకో యీ యాములు కుంగములయ్యె క్రూరతన్ ?15

క. అది యా కాంతామణి ము
ల్కోఁదఁ దగులం బుడమిఁ దూలె; హిమకరనిభమౌ
వదనము తరుణికి వాఁడెను
హృదయమునందలి రుధిరము లెంతయు నుబ్బన్. 16.

క. పైఁటయు నెత్తుటఁ దడియఁగఁ
బాటలగంధికి నరుణిమ పాటిలె, నిసుఁగుల్
గాటపు వంతలఁ బొరయఁగ
మాటలులే కవనిఁ గూలె మానిని యకటా. 17

* * * * * *

ఆ, వె. అంత వైరిసేన నతిమతి జక్కాడి
పాఱఁదోలి ప్రియను బాలకులను
జూడఁ గోరి శౌర్యశోణితనేత్రుఁడౌ
కందు తనబిడారుఁ గాంచ వేగ. 18

ఆ, వె. చెన్నుతఱిఁగి నిలిచియున్నట్టి డేరాను
గాంచి మేరలేని కళవళంబుఁ
జెంది దిగులుపూని కంది నల్గడలను
జూచి యెదుట నొక్కశూరుఁ గాంచి. 19

క. అను నాతఁడు॥ నాబాలురఁ
గొని నాప్రియ యెచ్చటఁ జనెఁ ? గొందల మదరెన్
మనమున, నీకుం దెలిసిన
గొనకొని తెలుపవె ? "యనంగఁ గూరిమి నతఁడున్. 20

తే,గీ. పలికె "నల్లదె చూపట్టు పర్వతంబు
మీఁదఁ గనుపట్టె నిప్పుడె మాపడంతి,
కాన నటఁ జూడఁ దగునయ్య గరిత"నంచు,
నంత నామాట విని యాతఁడగముఁ జేరి. 21

క. "ఏలొకొ యీనగమున నిటు
బాలురఁ గూడికొని కరము బాధలుపడునో
వాలుంగంటి"యటంచును
జాలిం దూలుచుఁ బిలిచెను "జానా"యనుచున్. 22

తే,గీ. నిసుఁగు లాయెల్గు నాలించి నిలిచి జనకుఁ
జూడ నద్దెసలను గాంచి "యీడ నున్న
వారమయ్య రమ్మ"నుచును బల్కు నులివు
వినుచు నయ్యెడఁ జేరెను వీరవరుఁడు. 23

క. అంతం బాలుర తండ్రిని
జెంతం గని నోటఁ గరముఁ జేర్చుచు "జనకా!
వంతలఁ బొరలుచుఁ దల్లియు
వింతగ నిందె నిదురించె విను"మని పలుకన్. 24

క. జల్లన నొడ లమ్మానిని
నల్లనఁ గని కంట్ల బాష్ప ములమఁగ నెంతే
నుల్లము చెదరఁగ నిలిచెను
మల్లడిగొనుచింత నడలి నుందుని పగిదిన్. 25

తే,గీ. అంత నొక్కింత తెలివొంది యవనిఁ గూలి
యున్న కనకాంగి దరిఁ జేరి యుస్సురనుచు

నెంతయును నెత్తుటను దోఁగి వంతగూర్చి
చెలియ వదనంబుఁ బొడఁగాంచి పలుకు నతఁడు. 26

చ. “చెలియరో! నన్నుఁ గాంచి కడుఁజెల్మిని బల్కుచుఁ గౌఁగిలించి నా
యలసటఁ దీర్తువంచు నెద నక్కట! యెన్నితిఁ గాని నిన్ను నీ
వలపయి నిట్లు ఖేదమున మ్రాన్పడి చూచెద నంచు నెన్న, నా
నలువ విధించెఁగా యిటులు నానొసటం గడునిర్దయాత్ముఁడై” 27

సీ. శీతాంశుకిరణాళిచేఁ దనచెలువంబుఁ దలఁగిన తమ్మిని బోలుచున్మోము
వాతాహతిం దూలి భూతలంబున నొఱఁగినతీఁగెఁ బోలిన వనితమేను
నిశితాసికృత్తమై నిగ్గులఁ బాసినచిగురులఁ బురుడించు చెలువపెదవు
లతిమత్తసింధురవితతిచే నూడ్వంగఁబడుతూండ్ల సరిపోలు పడఁతికేలుఁ
గాంచి చింతించి పలవించి కలవరించి
ములుకు నెదఁ జూచి చేఁజూచి తలఁకు దాఁచి
చివ్వనను దూసి మది గాసి చెలఁగ రోసి
బాలురం గాంచి శోకించి పలికె నిట్లు. 28

తే,గీ. “వరద! లోకైకరక్షక! వాసుదేవ!
భక్తజనఖేదపరిహారి! పార్థసచివ!
కరుణ యలరంగ నాదేవిఁ గావవయ్య
గరుడవాహన! శేషాహివరశయాన!” 29

తే,గీ. అనుచు శ్రీనాథుఁ జిత్తంబునందుఁ జేర్చి
పనవ,నొకబాలుఁ డాతనిపజ్జఁ జేరి
“తండ్రి! నిదురించుతల్లిని దగునె లేప
నిట్లు, నిదురవీడిన లేచు నింతయేల!” 30

క. అని పలుకఁగ నింకొక్కం
డనుఁ "దంద్రీ! యిదె కదలెడు నమ్మ చరణముల్
కనుమా"యన నాతఁడు వం
తనడఁచి చూడఁగఁ బడంతితనువును గదలెన్. 31

తే,గీ. అంత నవ్వీరవరుఁడు దా ననుఁగుసుతుల
నుడుల నాలించి చింతలఁ గడపఁ దలఁచి
"శ్రీమనోహరు నెదఁ దాల్చి చెలఁగువారి
కకట! చింతలు దోట్టునే యనుచు" నెన్ని. 32

తే,గీ. లేచి పద్మాస్యఁ బరికించి లీల సరసి
రుహముపై నటించు నళినివహము నాఁగ
వదనమును గ్రమ్ముచికురాళిఁ బాణిఁ ద్రోచి
చుంచు దువ్వుచు నిట్లనె మించుకూర్మి. 33

క. "సకియా! కన్నులఁ దెఱచుచు
నిఁక నీ బాలురఁ గను; మెద నెంతయుఁ జింతన్
దుకతుక గ్రాఁగెదు నాకున్
వికసనమిడ వేల యింక వినవేల! చెలీ! 34

ఉ. కన్నులఁ జూడ వేల యిటు గాటపు వంతల డిల్లపోవు న
న్నన్నులమిన్న! బాలురిదె యార్తిని గుందెద రింక నైన వా
రి న్నయమారఁగాఁ దిగిచి రెక్కోనుకూరిమిఁ గౌఁగిలింపఁగా
నెన్న విదేల? యీముఱుకు నేమనఁ జాలుదు నిన్ను నొంచెనే. 35

చ. చెలియరో! నిన్నుఁ గూడి యిఁకఁ జెందఁగ వచ్చు ముదంబటంచు నే
నెలమిఁ దలంచి రానకట! యీ కటుమార్గణమిట్లు నీదు మే

నలయుఁగ వక్షమందుఁ జొరఁ ద్రోచి నర్తిలి నాకముఁ జేరఁ గోరి యీ
కలఁతల నాకుఁ గూర్చితివె, గాటపు వంతల బాలు రేఁపఁగన్. 36

క. బాలా! నినుఁ బాసి పుడమి
నేలీల నసువులఁ దాల్చి యిఁక మనువాఁడన్?
బాలుర నిన్నుఁ దలంచుచుఁ
మాలఁగ నెట్లోర్తుఁ జూచి మూఁగెడుమదిలోన్! 37

ఉత్సాహ. బాల! వాఁడి యైన ములుకు-వక్షమందుఁ జొచ్చినన్
నీలమేఘవర్ణ వరదు-నెమ్మిఁ దలఁచినావొ! యీ
బాలుర నిటు వీడి యేగ-భావమెట్లు లోర్చెనే!
జాలిఁ గుందుమమ్ము వేగ-సారసాక్షి చూడుమా. 38

ఆ,వె. అనుచు నెదఁదఁ బొగిలి యలమినశోకంబు
వలనఁ బనవి పనవి పద్మదళము
లందుఁ గ్రాలెడు హిమబిందువులను బోలెఁ
గనులఁ గ్రమ్ముబాష్పకణము లురల. 39

తే,గీ. చెలియ మోమునఁ దనమోముఁ జేర్చి హృదయ
మగల వాపోవు నాతనియందు విజయ
సారథి కరుణించె; భళిర! భూరిశోక
కృశితభక్తుల వీడునే కేశవుండు 40

ఉ. చందురుఁ డంబరంబు విడి చయ్యన నేగిన భానుఁ డుష్పరం
బందుఁ జెలంగఁ బద్మములు హారిగతిన్ వికసించులీల నా
సుందరి నేత్రముల్ దెఱచె శూరవరాధ్యు వయుం గనంగ; నా
మందరధారిఁ జిత్తమున మానక కొల్చిన వంతలుండునే. 41

చ. వరదుని లోకరక్షకు నవార్యసుధీప్రదు నాశ్రితస్తవో
త్కరు నురుశౌర్యరంజితుని గామితదాయి ముకుందు మానిహృ
న్నిరతుని బాపదూరు సితనీరజనేత్రు రమామనోహరున్
నిరతముఁ గొల్చువారి కిల నెవ్వగ దొట్టునె భీతి గల్గునే. 42

తే,గీ. అంత నొకకొన్నినాళ్లకు నతివ తేలు
కొనియె నావిరుఁ డెంతయుఁ గూర్మి శ్రీశుఁ
గొలువ, బుదుతల మదిలోన గుబ్బటిల్ల
ముదము, లిందిరానాథుఁడు పదయుఁ డగుట. 43

---

తే,గీ. మానినీమణి యనుకృతి నా నిశాట
గర్వపరిహారియైన శ్రీకాంతు కరుణ
చేత రచియించె నిట్టులు శ్రీనివాస
శర్మ సుకవివరేణ్యుల శరణు చొచ్చి. 44

---

క. బాలుం డీతఁడు వీనిని
బోలదె లాలింప ననుచు బుధులు ననున్ దా
మోలిన్ బ్రోవరె కరుణన్!
గోలన్ దిట్టఁ దగునొక్కొ కోవిదుల కెటన్! 45.

శ్రీరస్తు.

# శివాజి

వనప్పాకము - శ్రీనివాసాచార్యులు (బి-ఏ) గారిచే

రచింపఁబడిన నూతన నాటకము.

వెల ౧౦ అణాలు.

## పండితులయభిప్రాయములు.

ఆంధ్రభాషాసంజీవని పత్రికాధిపతులగు బ్రహ్మశ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులు గారిట్లు వ్రాయుచున్నారు:—

శివాజి నాటకము—ఇది, శ్రీమచ్చెన్నపురిలో నెలకొనియున్న వైజయంతీ ముద్రాశాలకును, వైజయంతీ నామక మాస పంచికకును, నధ్యక్షులైయున్న బ్ర॥ శ్రీ॥ వనప్పాకము-శ్రీనివాసాచార్యులు, బి. ఏ. గారిచే రచితము, ప్రకటితము, మఱి మాకుం బ్రేషితము. ఈగ్రంథంబుం బాగుగ నారసినారము. ఇందు నాందిగం డనరెడిపద్యరత్నము ప్రస్తుత వస్తు బీజంబుగ ముద్రాలంకార ముద్రితమై బహ్వక్షరవినిభాసురంబుగం బరఁగుచుండుటవలన నెన్నిమాఱులు చదివినన్నాకుఁ జవిదీఱకున్నది. కాన దాని నిటనుదాహరింతము.

"శా. శ్రీపతియందు నేస్పునెయిఁ జిత్తమునందలపోయు లేకయా

పాపమతుల్ సుయోధనసహస్రముఖుల్ పనుగట్టెఁ జూచినన్

గోపముడించిసర్వగుణగుంభితసన్నుతవిశ్వరూపమున్
దోఁపఁగఁజేసికౌరవులదుర్ణయమాఁపినకృష్ణుఁడోముతన్."

అని యింతరసవంతముగ నీ నాటకగ్రంధము నంతయు రచియించిన యీత త్కృతికర్త ప్రౌఢకవి యయ్యును,

"ఆ, వె. కవియొచిలుతవాఁడుఘననాటకసుముది
తాత్ములీరు, మేమొయల్పులైన
నటులమయ్యలార! నర్మిలిమావగు
తప్పులోర్చికనుఁడుపయదలిర్పు."

అను నీపద్యంబు వ్రాయుటందలంప,

"శ్లో. క్వసూర్యప్రభవోవంశః క్వచాల్పవిషయామతిః
తితీర్షుందుస్తరంమోహాదుడుపేనాస్మిసాగరమ్."

అను నీకాళిదాసకవీంద్రశ్లోకరత్నము జ్ఞప్తికివచ్చుచున్నది. పద్ధిష్ఠులసచ్చ రిత్ర మిట్టిదేకద ?

## పంచరత్నములు.

తే, గీ. ఖేచరోల్లాసమనుగద్యకృతినొసర్చెఁ
పద్యకృతినిసతీమణిభాసిలఁగను
జేసెనుశివాజినాటకమీసమయము
నందుఁగావించెశ్రీనివాసార్యుఁడౌర.

ఆ, వె కథయొవిరసమరయఁగడురసాభాసంబు
గాను గానఁబడెడునైననీశి
వాజినాటకమునుబరఁగించెఁబనపాక
శ్రీనివాసకవివరిష్ఠుఁడుగద.

క. ఈసరసుఁడు స్వాఖ్యాదిమ
భాసురవర్ణైక్యకలనఁ బట్టియొకో శివా
జీ సన్నాటక మొనరిచె
నీసాయూరోహణమున నెగడుట నొక్కో.

ఉ. ఆపదఁ జెందియున్న యపుడైన స్వజాతినిధర్మ మేదఁగా
నోపఁడు దాని నేదుకొను నుత్తముఁ డంచని తెల్పు నుత్తమ
స్త్రీపతి గాఁగ నొక్కని వరించి మఱొక్కనిఁ బొంద దెందు నా
నీపరమార్థముం దెలుపు నీకృతి ధర్మనిరూపకంబుగా.

క. పనపాక శ్రీనివాసా
ఖ్యనిఁ దత్కృతినిక్ శివాజినుసగుణయున శ్రీ
జననితనుమధ్య ప్రోచుక్
దనుదినుతింమటను బిల్వనాఘుఁడు ప్రీతిక్.

అని కృతిం బ్రశంసించుచుఁ గృతికర్తనాశీర్వదించుచున్నాము.
విపుఁజేష్ఠ నాశీర్వాదుఁడగుటనో, యీశివాజి నాటకము వెల యఱరూపాయలు.

---

బ్రహ్మశ్రీ వావిలాల-వాసుదేవశాస్త్రులుగారిట్లు వ్రాయుచున్నారు:—

ఉ. ద్రావిడవిప్రసూతి బహుతత్పరతం దెలుఁగుం గ్రహించి వి
ద్యావరుఁడై కవీంద్రుఁడయి తంద్రికదం గురుభాద్ధభక్తిరెం
జేవఱలంగ స్వాన్యనృపనీతివిశేషములం దికొంచుఁ బు
ణ్యావహతీర్థమాడి విబుధాదృతుఁడౌ బలె వైజయంతిలో.

క. అద్వైతిగురుండు విశి
ష్టాద్వైతిగురుండు సరిగ నానందింపక్
హృద్వీధి శైవవైష్ణవ
పద్వసజములాశ్రయించు ప్రతిభలు గంటే!

నిష్ఠురుఁడైనవీఁడు వెరవుఁగా నూహించి భటులతోఁ బలికెను బ్రాహ్మణులకు
భోజనంబిడవలె నోజమీరఁగ వారిఁ దప్పింపుఁడని చెప్పి యొప్పించి
ద్విజులను బిలిపించి తెలిపి రహస్యంబుగ నంపలో నాహారమంపినట్టుల
గొన్ని తూములు సేసి కుటిలవృత్తి వహించి పుత్రునితోఁ గూడఁ [illegible]
కారాగృహము వీడి కడఁజనె నీవార్త పాదుషా విని మది భయము బూని
భటులను బంపెను బటు బాహుబలయుత ధీరుల శూరుల దిక్కు దిక్కు—
నిటు కొన్ని దినములు చటులాహవక్రీడ సలుపుచు యవనులఁ జంపి తుదను
దైవవశంబున దివికేగె నది విని పాదుషా పట్టి తాపంబుఁ జెంది
మూర్ఛిలి మఱి తేరి సునిఁగె దుఃఖాగ్నిపరుని నెవ్వనిఁ దాను బతిగఁ గో—
నను చుఁ బ్రతిన వట్టె నాగడె మిదియని యెవరెన్ని చెప్పిన సాంత్వముగాను
మది నెంచక శివాజిమహిమలు గొనియాడి రేసగిరులుంచి దైవనాథ
భటులొక శిశువును బట్టి తెచ్చిరి వాని శంభాజిసుతుఁడని సంభ్రమించి
వాని పోషణయందు వ్యసనంబు నేమఱి కన్నెగా బ్రదుకు నమవన్నెకన్నె—
నను కథనంతయు నను వారి మృదుపదవాక్యచమత్కృతి నసింక నెల్ల—
లాగున వర్ణించి లాలితంబుగ వ్రాసి చదువువారలకును జప్పుఁ దీర్పఁ

గీ. జేసి వాసిఁగనుచుఁ జెలిమి రెట్టింపఁగఁ
బొత్త మొకటి నాకుఁ బ్రీతమలరఁ
బంపఁ జదివి నాదు భావంబుఁ దెలిపితి
నింగునుండి యిడితి వందనముల.

---

## శశిలేఖ.

### శివాజీ, (నాటకము.)

మహారాష్ట్రప్రభువగు శివాజినిగుఱించి హిందూదేశచరిత్రములోనుండు
—న్ని యంశములం బఠించి శ్రీమాన్ వనప్పాకము శ్రీనివాసాచార్యకవి సత్త్వఁ డీనా

టకమును సంతరించెను. ఈ బాలకవి యిదివఱకు కొన్ని వచనప్రబంధములు, కొన్ని పద్యకావ్యములను, వ్రాసి మనరాజధానిలోనుండు కవివర్యులచే సన్మానింపంబడియున్నారు. వచనరూపముగా వీరువ్రాసిన ఖేచరోల్లాసము, పద్యరూపముగవ్రాయంబడిన సతీమణి వీరిపాండిత్యమును, కవననైపుణ్యమును జెప్పక జెప్పుచున్నవి. మఱి యిపుడు నాటకమును వ్రాసిరి. ఈనాటకముయొక్క రచనను బట్టిచూడఁగా శ్రీనివాసాచార్యులవారి కవనమునకు వన్నె హెచ్చుచున్నదని రసికులకు విశదమగుననుటకు సందియంబులేదు. వేయిమాటలేల, యీగ్రంథములను జూచునట్టిభాగ్యము మాకలవడినపుడు, మనయాంధ్రభాషకును, మనదేశమునకును మంచిదశవచ్చుచున్నదని నమ్మిహర్షించువారము. సింహము గర్భవాసమున సింగపుకొదమేగదా జన్మించును. అన్యథా సంభవించుట యీశ్వరసంకల్పమునకు విరుద్ధముకదా! కాంగ్రెసు మహాసభ కగ్రాసనాధిపతిగ నుండుటకును గవర్నరు జనరల్ గారిశాసన నిర్మాణసభకు మనరాజధాని తరపున మెంబరుగనుండుటకును, నవద్వీపములోనుండు పండితగోష్టిచే 'విద్యావినోది' యని ఘనతం గనుటకును, దగిన హానరబిల్ రాయబహద్దర్ శ్రీమాన్ పనప్పాకము అనంతాచార్యవర్య పుత్రరత్నమునకట్టి భాషాభిమానము, పాండిత్యము, గలుగుట యబ్బురంబె. ఈనాటకమును మేము పలుమరు చదివి యానందించితిము. కాళిదాసాది మహాకవులు వ్రాసిన గొప్పగ్రంథములను రసాభాసముచేసి, తర్జుమాచేయుటకంటె మన శ్రీనివాసాచార్యులవలె నూతన నాటకములను పాండిత్యముగలవారు వ్రాసి లోకోపకారులగుట శ్రేయము.

---

బ్రహ్మశ్రీ శృంగారకవి సర్వారాయఁడుగారిట్లు వ్రాయుచున్నారు:—

ఉ॥ వ్రాసితిగద్యపద్యములఁ గ్రాలసతీమణి, మున్ను ఖేచరో
ల్లాసముగద్యసత్కృతులలంకరింపఁగఁ జేసితి, పిమ్మ నాటకం
బ్రాసముమీఱఁజేసితివి శిష్టవిచిత్రము, శ్రీనివాస! నీ
కే సరి చెప్పవచ్చు? నెఱకన్నెలతో సమసాక్షికావ్యతోన్.

మ. పదలాలిత్యముసర్థగౌరవముభావప్రక్రియల్పొక సం
పదభాషాపటిమంబలంకరణశోభావ్యుత్పత్తిమాధుర్యసం
తిపలంబౌరసయుక్తియుంబొసఁగునీదివ్యచ్ఛివాజీచరి
త్రపగుంగావ్యకుమారికాభరణపత్త్రప్రాయమైయుర్వరన్.

---

M. R. Ry. P. RAMA RAYANINGARU, M.A. OF KALAHASTI WRITES :—

I thank you for sending me a copy of your *Sivajee*. Accept my warmest congratulations once again, for having distinguished yourself as the author of an interesting work.

Like your *Sateemani*, your *Sivajee* is a desirable departure from the ordinary run of the Telugu Literary productions. In this, I believe we have for the first time, a Telugu Historical Play, worth the name. And I am very glad to say, you have done in every way ample justice to the play.

---

M. R. Ry. K. AIYAR OF MADRAS WRITES :—

I had the good fortune to go through your recently published drama viz., "*Sivajee*". * *
In poetic diction, your drama is far superior to your own *Sateemani*. The conduct of Sivajee is highly acceptable and that of Neesa, the daughter of Aurangazeeb, admirable. On the whole your drama may be considered as a success. Please accept this stanza as a poor but sincere tribute to your merits.

ఉ. చేకొనివర్తమానకవిశేఖరచిత్తములర్పగోత్తను
పాకముసంపుసత్కృతిత్రాయఁగనేర్చుభవత్ప్రయోగాసమ

ప్రాకము శ్రీనివాసకవిభాగ్యమిఁ కేమన! నాట్యరంగమం

కృతియుం బ్రయోగమున కెక్కు నటంచు వచింతు నమ్మికన్.

---

## THE MADRAS STANDARD.

: congratulate Mr. P. Srinivasa Charlu B. A., on the he has so deservedly achieved on his second publi- * * * The present work "Sivaji," an historical drama .nplete delineation in Telugu of the life of an Indian of historical fame. Though in verse the style adopted 'e in the running with the Telugu literature of the Vt day. The whole plot is nicely divided into different succes:ach depicting a separate subject. The little book cation.rofitably be introduced into schools and colleges as is a co-book. The binding is neat and fully oriental in appearance, in a way suggesting the contents within.

---

బ్రహ్మశ్రీ వడ్డాది-సుబ్బారాయఁడుగారిట్లు వ్రాయుచున్నారు.

ఉ. వందనమాచరింతు మఘవద్రచితంబు శివాజినందితన్
డెందము సంతసంప డెఁబరించుట చేనది తేనెతుంపురుల్
చిందెడు తేటమాటలను చిందెడు నీకృతి పాత్రశాలలం
దిందుకళావతంసుకృప నెప్పుడు నాట్యమునర్పుఁగావుతన్.

మఱియు.

"సీ. చేఁజాచి యంచలఁ జెలిమి మైదరిఁ జేర్చి యింతి మోమటు ద్రిప్పియేల తోల
నెలుఁగిచ్చి పికముల నెలమిరా నిచ్చి రామలఁ బిల్చి యిట్టులు మలఁప నేల

మోముఁజూపినపచ్చమురిపంపుఁదేఁటులముక్కునఁగినిసిపుత్తెదేల
తియ్యనిమాటలకొయ్యవచ్చినచిల్కవలపుఁబైఁటవిదిల్చికలనేల
కలికియీజాడరాజహంసలుఁబికములు
మధుకరశుకంబులివెవచ్చిమనికితపడి
నిన్నుఁగన్గొనిమగిడెడి; నెమ్మిగనుచు
వీనిలాలించిమురియవువింతగాదె.”

ఇత్యాది రసవత్పద్యంబులును నింకను నిందుం గానవచ్చెడు గర్భిత్వాది విశేషంబులుం బరికింప మీకృతివిషయమున నాకు స్ఫురియించిన చాటుక్కటి యీక్రిందం బొందుపఱిచి విరమించుచున్నాఁడను.

చాటుపద్యము.

“ ఉ. ఎన్నఁడు నేరిచెం బెళుకులీచెలికన్నులు కాటుకమ్ముల
న్నన్నకురుల్ పిఱుందుబటువై పటువై ఖరిగైకొ నెంగదే
మొన్నగదమ్మ చిన్న మొన మొల్కలు నేఁడి దెముద్దరాలి శేఁ
జన్నులుగొప్పలై పయిఁటసందునదాఁగిలి మూఁతలాడెడున్.”

---

బ్రహ్మశ్రీ శలపాక-వేంకటసూర్యప్రకాశప్రధాని గారిట్లు వ్రాయుచున్నారు:—

సీ. ఒకచోటఁ గరుణారసోజ్జ్వలస్థానమైయొకచక్కిశృంగారమొలుకునదయి
యొకవంకవీరరసోదంచితంబయియొకయోరరౌద్రరసకలితమయి
యొకదిక్కునను భయానకపూరితంబయియొకదెసశోకరసోదితమయి
యొకతావునందుగర్భకవిత్వఖనియయియొకమూలబంధవృత్తకరమయి
యంతటను సులభార్థపదాంచితమయి
పాఠకజనోత్కరాహ్లాదపథమునగుచుఁ
జనుఁబనప్పాకశ్రీనివాసరచితమయి
తేటఁగను శివాజియనెడు నాటకంబు.

# STREEDHARMABODHINI

743.

BY

MALLADY SURYANARAYANA SASTRI,

*Telugu Pandit. Board High School, Amalapur.*



FOR THE USE OF GIRLS

OF THE 2ND, 3RD AND 4TH STANDARDS.

COCANADA:

PRINTED BY THE PROPRIETOR P. BRAHMANANDA ROW AT THE SUJANARANJANI PRESS AND PUBLISHED BY THE AUTHOR. 1904.

Copy right Registered.

శ్రీరస్తు.

# స్త్రీధర్మబోధిని.

ఇది

అమలాపురము బోర్డు హైస్కూలునందాంధ్రోపాధ్యాయుఁడగు

మల్లాది సూర్యనారాయణ శాస్త్రిచే రచింపఁబడి

కాకినాడ:

సుజనరంజనీ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి ప్రకటింపఁబడియె.

1904.

Copy-Right] [Registered.

శ్రీమత్పరదేవతాయైనమః.

# స్త్రీ ధర్మబోధిని.

## 2వ తరగతి పద్యములు.

క॥ శ్రీరమణీమణి సిరినిడు
భారతి విద్యలనొసంగుఁ బార్వతివిద్యా
ధీరుని వరు సౌభాగ్యము
గారాబముచేతఁ జదువుకన్నెల కొసఁగున్॥ 1

### స్త్రీలకు విద్యరామి నష్టములు.

గీ॥ కొంద ఱెఱుఁగనివారలు క్రూరబుద్ధి
బాలికలఁ బాఠశాలలఁ బనుపఁ దగదు
ఊళ్ళనేలున లేక యుద్యోగములను
జేయునా యంచువాదంబు సేయుచుంద్రు॥ 2

గీ॥ కానియుపయోగములు పెక్కుగలవు బాలి
కలకుఁ జదువున నిప్పటికాలమునకుఁ
దగినరీతిని ధర్మంబుదాటరాక
చెప్పెదనుగొన్ని పండితుల్ చిత్తగింప॥ 3

---

1. శ్రీరమణీమణి = లక్ష్మీదేవి, సిరిన్ = సంపత్తును, భారతి = సరస్వతి, పార్వతి = గౌరి, విద్యాధీరుని = చదువునందుఁ దెలివిగలవానిని, వరున్ = మగనిని, సౌభాగ్యము = సుభగత్వము, ఒసఁగున్ = ఇచ్చును. 2. క్రూరబుద్ధిన్ = చెడుబుద్ధిచే, పనుపఁదగదు = పంపఁగూడదు, వాదంబు = సంభాషణము, 3. ఉపయోగములు = లాభములు, ధర్మంబు = న్యాయము,

గీ॥ తల్లికడుపునఁ బుట్టినతఱిని బాలి
కలకు బాలురకును నేమికలదు భేద
మెదుగుకొలఁదిని మగవారి కెఱుక హెచ్చుఁ
గాంతలకు హెచ్చదేమగుఁ గారణంబు॥ 4

గీ॥ తలఁప మగవారిబుద్ధియు దాతచేత
మెలఁగు ధనమట్లు పలు తెఱంగుల మెఱుంగుఁ
బొలఁతులమతియుఁ బాతులోఁ బూడ్చఁబడిన
లోభిధన మట్లుగతి లేక లోనణఁగు॥ 5

గీ॥ ఒకటి రెండని పదిదాఁక నోలిఁ గొలత
గొలుచునప్పుడు లెక్కించి కొఱఁతవడిన
యంకెలెఱుఁగక పదిమీఁద నాఱు రెండు
పదులనందగు పడఁతు లిప్పటికిఁ గలరు॥ 6

గీ॥ పడఁతులందఱు నొకచోటఁ గుడిచి కూరు
చుండి యేవైనగొడవల నుబుసుపోక
పెట్టికొనుదురు గాని యేపట్టునందు
దైవభక్తి నిసలుపంగఁ దలఁపుగొనరు॥ 7

---

4. తఱిని=కాలమందు, ఎఱుక=తెలివి, కాంతలకు=స్త్రీలకు, కారణంబు=హేతువు. 5. దాతచేతన్=దానముచేయువాని చేతిలో, పలు తెఱంగులన్=పెక్కువిధములుగా, మెఱుంగున్=ప్రకాశించును, పొలఁతులమతి=స్త్రీలబుద్ధి, గతి=దిక్కు. 6. ఓలిన్=క్రమముగా, కొఱఁతవడిన=మిగిలిన, 7. కుడిచి=తిని, ఉబుసుపోక=తోచక, సలుపంగన్=చేయుటకు, తలఁపు=ఊహను, కొనరు=గ్రహింపరు.

గీ॥ చదువు రానట్టి భార్యలు చదువుకొన్న
భర్తలును గూడియుండుట వల్ల పెరుగు
గలిపిన విధంబుగా నుండుఁ గాదె పొత్తు
గలియ కద్దాన మనములఁ గలఁత పుట్టు॥ 8

గీ॥ ఎవతెయో యొర్తు తక్క నీ యుర్వియందు
నెఱచుగా విద్య నెఱుఁగని తరుణులెల్ల
నింటిశుచి మేనుశుచియును నెఱుఁగరారు
కయ్యమునఁ గాలుద్రివ్వంగఁ గడఁగుచుండ్రు॥ 9

గీ॥ ఇన్నిటికిఁ గారణము చూడ నింతులకును
జదువు నేర్పకపోవుట గదయటంచుఁ
దలఁచి తమ బాలికలకు విద్యలను నేర్ప
వలయుఁ దప్పక జ్ఞానంబు గలుగువారు॥ 10

—* స్త్రీవిద్యానిర్వచనము, దానివలని లాభములు. *—

గీ॥ రమణులకు భారతాది పురాణములు చ
దువఁగఁ దగినవి యని వ్యాసకవి వచించెఁ
దెలివిఁ బతిభక్తి వినయంబుఁ దెచ్చు విద్య
గాన బాలికలకు విద్య గఱపవలయు॥ 11

8. పొత్తు = స్నేహము, అద్దానన్ = దానిచే, మనములన్ = మనస్సులందు, కలత = విరోధము, 9. ఉర్వి = భూమి, తరుణులు = స్త్రీలు, మేను = దేహము, కడఁగుచుండ్రు = ప్రయత్నింతురు. 10. ఇంతులు = స్త్రీలు, 11. రమణులకు = ఆడువారికి, కఱపవలయున్ = నేర్పవలయును.

గీ॥ మానుషీజన్మ మెత్తియు మంచిచెడ్డ
లెఱుఁగకజ్ఞానమనునూతనీఁదిపైకిఁ
దీయుభగవంతుఁడను మాటదెలియకండె
సమసిపోవుట చదువులోపమునఁగాదె॥ 12

గీ॥ పుట్టిరేబొడ్డునన్ మణిపెట్టికొనుచుఁ
బురుషులట్లాడువారలు పుట్టలేదె
చదువుపతికిని సహజమై సతికిఁగాదె
వారుమాత్రము నరజాతివారుగారె॥ 13

గీ॥ విద్యయన జ్ఞానమేకద విద్యలేమిఁ
బశువులేకద విద్యకుఁ బడఁతులేమి
నోచరే నేర్చుకొనుటకు నోరులేదె
కానఁ జదివింపుఁడీ స్త్రీలఁ గరుణతోడ॥ 14

గీ॥ విద్యనేర్చిన వనితలు విభునిమనముఁ
దెలిసివర్తింతు రతనియాజ్ఞలకు నొదిగి
యుందురదిగాక జంతువులందుఁ గరుణ
గలిగియుందురు జ్ఞానంబుగలిగియునికి॥ 15

---

12, మానుషీజన్మకు=ఆడుపుట్టుక. అజ్ఞానమనునూతన్=తెలియకపోవుటయను నూతిలో, సమసిపోవుట=చచ్చిపోవుట. 13. పుట్టిరే=పుట్టినారా? నరునకు=మనుష్యునకు, సహజము=తోడఁబుట్టినది, సతికి=ఆడుదానికి. 14. లేమిన్=లేకపోవుటచే, పశువులు=మృగములు, కరుణతోడన్=దయతో, 15. వనితలు=స్త్రీలు, విభునిమనము=మగనిమనస్సు, ఆజ్ఞలకు=శెలవులకు, కలిగియునికిన్=కలిగియుండుటచే.

గీ॥ చదువు నేర్చినవనిత సంసారమీఁది
కొఱను దనయంత నేమియుఁ గొఱఁతలేక
కష్టపడి తెచ్చు మగవాఁడు కష్టములను
మఱవఁగరిగించు మనసు సంభాషణమున॥ 16

గీ॥ నీతికినిబుట్టినిల్లగు నిఖిలధర్మ
ములకుసాధనమగు దానమునకు వెనుకఁ
దీయకుండును దయకునుద్దీపకమగుఁ
జదువుకొనినట్టి భామినీజనముదలఁప॥ 17

గీ॥ ఇంటఁదమచిన్నపిల్లల కెలమిఁజదువు
నేర్పుదురు దైవభక్తియు నీతిగలిగి
తీరు వేళలఁగూర్చుండి దేనినైనఁ
జదువుకొనుదురు చిత్తంబు సంతసింప॥ 18

## మాతృభక్తి.

గీ॥ తొమ్మిది నెలలు మోసి భారమ్ముగాఁగ
గర్భమున సూతివేదనఁ గష్టపడుచుఁ
గని పునర్జన్మమెత్తిన కరణినుండు
తల్లినతిభక్తితో మదిఁదలఁపవలయు॥ 19

---

16. కొఱఁత = లోపము, కష్టములను = దుఃఖములను, సంభాషణమునన్ = మాటలాడుటచే. 17. నిఖిలధర్మములకు = అన్ని ధర్మములకు, ఉద్దీపకము = ప్రకాశింపఁజేయునది, భామినీజనము = ఆడువారు. 18. ఎలమిన్ = ప్రేమతో, చిత్తంబు = మనస్సు, సంతసింపన్ = ఆనందించునట్లు. 19 భారమ్ము = బరువు, గర్భము = కడుపు, సూతివేదనన్ = కనునట్టికష్టముచే, పునర్జన్మము = తిరిగి పుట్టుక.

గీ॥ బోరగిలఁబడు నెపుడునవ్వునుబోరలును
బాకు నడచును బలుగెత్తుఁ బలుకనేర్చు
ననుచుమనకభివృద్ధినే యరయుచుండు
తల్లికంటెనుదేవత తలఁపలేదు॥ 20

గీ॥ ఆవుపాలెన్నిపోసిన నగ్నియాజ్య
మట్లుహరియించు తనయుదరాగ్నిఁ బాలు
గుడిపితగ్గించి నిదురపోఁగొట్టునట్టి
తల్లినతిభక్తితో మదిఁదలఁపవలయు॥ 21

గీ॥ పాకుచుండెడుతఱి భూమిపైని దప్పు
టడుగులిడునెడ మాటలనాడునపుడు
తన్నుఁగౌఁగిటఁజేర్చి సంతసముతోడ
ముద్దులిడి పెంచుతల్లికి మ్రొక్కవలయు॥ 22

గీ॥ ముట్టుకొనుటకు భయమును బుట్టఁజేయు
పసితనంబున నుండినబాలనెన్ని
యెన్నిబాములఁ బడిపెంచె నెవ్వఁడెఱుఁగుఁ
దల్లికష్టంబు తల్లికేతెల్లమగును॥ 23

ఆ॥ ఓర్వలేనివా రలుండినఁబొరుగున
కెప్పుడేగనీక యింటనుంచి

---

20 అభివృద్ధిన్ = పెంపును, ఆయుస్సు = ఆయుర్దాయము, ఆజ్యము = నేయి, ఉదరాగ్నిన్ = కడుపుచిచ్చును. అతిభక్తి = మిక్కిలిస్నేహముతో, 22 ఇడునెడన్ = పెట్టుసమయమందు, కౌఁగిటన్ = భుజములమధ్యమందు. 23 పసితనంబునన్ = చిన్నతనమందు, ఎన్నిబాములన్ = ఎన్నికష్టములను, తెల్లము = స్పష్టము,

కొనుచు నంగరక్షలను జేయుచుండెడు
తల్లి భక్తితోడఁ దలఁపవలయు॥ 24

గీ॥ నీళ్ళువోసిచుక్క నెమ్మొగమ్మున దిద్ది
కండ్లఁ బెట్టి కాటుకయును జిక్క
వడినపాపిడి విడఁబఱచితినంగనే
దేనిఁబెట్టు తల్లి కెఱగవలయు॥ 25

గీ॥ అత్తయింటికి నేగినయపుడు పనులు
సేయకయతప్పదిపుడేల చేయుటయని
యచ్చటిదిపెట్టు మిచ్చటననుచుఁ జెప్ప
రానితల్లిని భక్తితోఁ గానవలయు॥ 26

గీ॥ పండుగయటంచు నిలువకనుండు మధుప
దార్థములఁ జేసి యొప్పుఁ దడవుకొనక
వచ్చుపండుగ వఱకును వానిఁ గూర్మిఁ
బెట్టుతల్లికి సరివారుపృథివి లేరు॥ 27

గీ॥ చిన్నఁదనమును నదిదరిఁ జేర నావ
గడియగడియకు వచ్చురోగముల కౌష
ధంబు సర్వము నొసఁగంగ ధాత్రి కన్న
తల్లియామెను వర్ణింప ధాతతరమె॥ 28

---

24 ఓర్వలేనివారలు = సహించలేనివారు, ఏగనీక = వెళ్ళనీయక, అంగరక్షలను = శరీరసంరక్షణములను, 25 నెమ్మొగమ్మునన్ = ముద్దుమొగమునందు, పాపిడి = కేశమధ్యము, ఎఱుగవలయునన్ = నమస్కరింపవలయును, 26 అచ్చటిది = అక్కడనుండువస్తువు, కానవలయున్ = చూడవలయును, 27 మధుపదార్థములను = తియ్యనివస్తులను, కూర్మిన్ = ప్రేమతో సరివారు = సమానులు, పృథివిన్ = భూమిలో, 28 నదిదరిన్ = ఏటియొద్దను, నావ = పడవ, ధాత్రి = పుడమి వర్ణింపన్ = పొగడఁగా, ధాత = బ్రహ్మ.

గీ॥ తెలివిలేనట్టివారలు దేవతయని
వేఱె కలదందురది చూడ వెఱ్ఱితనము
ఎల్లవేదంబులును జెప్పఁ దల్లికంటె
వేఱె దేవత లేదని వేయినోళ్ల॥ 29

గీ॥ మాటలాడుచునుండెడు నాటనుండి
నిజవచంబులు పలుకుట నేర్పుచుండి
నడకవచ్చుచునుండెడు నాటనుండి
మంచినడతను నేర్పెడు మాత మాత॥ 30

గీ॥ పుత్రి యెప్పుడు నాయింటఁ బుట్టుదాని
మొగము నరయుదు నెప్పుడు ముద్దుపెట్టి
కొనుమనని చాలఁ దపియించి కనియుఁ గష్ట
పడుచుఁ బెంచిన తండ్రి దైవంబు మనకు॥ 31

గీ॥ కాళ్లగజ్జెలు మ్రోయంగ ఘలుఘలుమని
తప్పటడుగులు పెట్టెడు తన్నుఁ జూచి
తనివి దీరంగఁ గౌఁగిటఁ దార్చునట్టి
తండ్రినే దైవమని నమ్మఁదగును జుమ్మి॥ 32

గీ॥ ఏమి కోరిన నద్దాని నిచ్చి తనకు
నేవిధంబైన కొఱంత రానీయకుండ
నెప్పుడును దన్నుఁ గంటికి ఱెప్పవోలెఁ
గాచు తండ్రిని భక్తితోఁ గాంచవలయు॥ 33

---

29 అది=ఆసంగతి, దేవత=దేవి, 30 నిజవచంబులు=నిజమైనమాటలు 31 పుత్రి=కూతురు, అరయుదుఁ=చూచెదను, 32 తనివి=తృప్తి, తార్చునట్టి=చేర్చునట్టి, 33 అద్దానిఁ=ఆవస్తువును, కొఱంత=లోపము, కాచుతండ్రిని=కాపాడుజనకుని,

గీ॥ తనకునైదేండ్లు వచ్చినతఱిని బాల
శాలకుం బంపిచదివించి సకలధర్మ
ములనునేర్పించి చదివినకొలఁది సంత
సంబునొందెడు తండ్రిదైవంబుగాదె॥ 34

గీ॥ తనకుఁబెండిలిసేయంగఁ దలఁచిమంచి
యల్లుఁడెక్కడ దొరకునోయనుచుఁదల్ల
డిల్లిపెక్కండ్రివరులను నెల్లయూళ్లు
లందుఁజూచుచుఁ దుదకొక్కయతని వెదకి॥ 35

గీ॥ కులముమంచిది చదువునుగలదుచిన్నఁ
దనము చక్కనిరూపంబు ధనముగలుగు
ననితలంచుచు బంధులయాజ్ఞ వడసి
పెల్లసుఖపడు ననుచును బ్రీతితోడ॥ 36

గీ॥ ధర్మవిహితంపుశుభముహూర్తంబునందు
నుభయలోకంబులం గీర్తినొందఁదలఁచి
తన్నునాతనిచేతిలో దారవోయు
తండ్రినేదైవమనినమ్మఁదగునుజుమ్మి॥ 37

గీ॥ అమ్మ! పాడుముపాట పద్యంబుచదువు
మనుచుఁజదివించిచెవులార వినుచునమృత

---

34 సకల ధర్మములను=ఎల్ల న్యాయము లను, దైవంబు=దేవుఁడు. 35 పెండిలి=వివాహము, తల్లడిల్లి=పరితపించి, ఊళులందున్=గ్రామములందు, తుదకున్=చిట్టచివరకు, 36 కులము=వంశము, బంధులయాజ్ఞ=చుట్టముల సెలవు, ప్రీతితోడన్=అనురాగముతో 37 ధర్మవిహి......ర్తంబునందున్=శాస్త్రమందుఁ జెప్పఁబడిన మంచివేళను, ఉభయలోకంబులన్=రెండులోకములందు, కీర్తిన్=యశస్సును,

మపుడు త్రాగినరీతిగా నాత్మసంత
సంబునొందెడుతండ్రి రక్షకుఁడుగాఁడె॥ 38

గీ॥ పిల్లకించుక మేనున వేఁడిపుట్టె
ననుచు మందిచ్చి కుదిరెడునంతవఱకు
నిదుర నన్నంబు నెఱుఁగక బెదరుచుండు
తండ్రికిన్ దైవమునకు భేదంబుగలదె॥ 39

గీ॥ తన్నుఁగని పెంచి బుద్ధివిద్యలను జెప్పి
పెండ్లిగావించి సుతునిఁగాఁ బ్రీతిఁజూచి
యత్తవారిగృహంబున కనుపఁగరుణ
రసముగను తండ్రి ఋణముఁదీర్పంగఁదరమె॥ 40

## ※ సోదరుల యెడ భక్తియనురాగములు. ※

గీ॥ తమ్ములన్నలు గలుగుట తనదుపెండ్లి
కగునిషేధంబు లేకుంటయయ్యెనట్టి
వారి యెడననురాగంబు భక్తిపొసఁగ
బాలచూచుచునుండంగవలయుఁ జుమ్మి॥ 41

గీ॥ తండ్రితరువాతఁ దండ్రియంతటిదయాళుఁ
డనఁగఁదగునన్న తనకేమియును గొఱంత
చెందరానీక రక్షణసేయు నతనిఁ
దరుణికడుభక్తితో మదిఁదలఁపవలయు॥ 42

38 అమృతము=సుధ, ఆత్మన్=మనస్సులో, రక్షకుఁడు=కాపాడువాఁడు. 39 ఇంచుక=కొంచెము, మేనునన్=దేహమందు, 40 బుద్ధివిద్యలను=జ్ఞానమును, చదువును, సుతునిఁగాన్=కొడుకుగా, కరుణరసము=విచారమును, ఋణము=అప్పు, 41 నిషేధంబు=తప్పు, పొసఁగన్=ఒప్పునట్లు, 42 దయాళుఁడు=దయగలవాఁడు, తగునన్న=తగునట్టిసోదరుఁడు, రక్షణసేయున్=కాపాడును.

గీ॥ భ్రాతలుం దమకెంతగా భాగ్యమబ్బ
నంతయును భాగమునఁ దమ్మునరయుచుందు
రట్లుగావున నాఁడుదియన్నలందుఁ
దమ్ములందును బ్రేమతోఁ దరలవలయు॥ 43

గీ॥ తోఁడఁబుట్టువులను జెందనాఁడఁబోక
కలసిమెలసి ప్రవర్తింపవలయునెప్పుడు
పథికులకునీడపోలికఁ బరగుఁదోడు
తోడా నీడయొ యనునట్టి పాడివినమె॥ 44

గీ॥ ఎందతైనను జెలికత్తెలెందతైన
బందుగులు నక్కసెల్లెండ్రపాటిగారు
కలరుబందుగు లెల్లచోటులను గాని
తోఁడఁబుట్టినవారట్లుచూడ రారు॥ 45

గీ॥ ఒక్కకడుపున జనియించియొకతె పాలు
ద్రావివోర్తుక చేఁబెంపుఁదగిలియొక్క
కంచమునఁగూడుగుడిచి యైక్యంబువడయు
సోదరులప్రేమకుం దరిచూడ లేదు॥ 46

---

43 భ్రాతలు = అన్నదమ్ములు, భాగ్యము = సంపత్తు, తరలవలయున్ = నడుచుకొనవలెను, 44 తోఁడఁబుట్టువులను = అక్కసెల్లెండ్రను, పథికులకున్ = బాటసారులకు, తోఁడు = సహాయము, పాడి = న్యాయము, 45 బందుగులు = చుట్టములు, 46 జనియించి = పుట్టి, త్రావి = త్రాగి, ఓర్తుకచేన్ = ఒక్కతల్లిచే, ఐక్యంబు = ఒక్కటియగునట్టిప్రేమను, దరి = అంతము, పెంపు = వృద్ధిని.

గీ॥ ఏటికొకసారి పుట్టినయింటికేగు
దెంచిమనసారఁ గౌఁగిలి చేర్చికొనుచు
వెళ్లువరకాత్మసంగతి వెడలఁబోసి
కొనెడుతోఁబుట్టువులప్రేమ ఘనముగాదె॥ 47

గీ॥ ఒకతె సిరిసంపదలకు మహోత్సవంబు
వడయునొక్కతె యొకతె లోపములకొకతె
గుందుమనమున నహహా యీగుణములెల్ల
వారికేచెల్లెడున్ జెఱవారికగునె॥

గీ॥ వినుఁడు రెండవతరగతి పిల్లలార !
భక్తితోమీరు గురువుల పల్కులువిని
చదువుఁడీనీతిపద్యముల్ సదమలమతిఁ
దెలివి, వినయంబు విద్యయుఁ దేజరిల్ల॥ 49

గీ॥ చదువులేమినినష్టంబు చదువువలన
ఫలము మాతాపితలభక్తి భ్రాతృభక్తి
సోదరీప్రేమయునుగల సుదతినీతి
వ్రాసెమల్లాది సూర్యనారాయణకవి॥ 50



47 ఏటికిన్=సంవత్సరమునకు, ఏగుదెంచి=వచ్చి, మనసారన్=తనివిదీర, ఆత్మసంగతి=తమవృత్తాంతములను, వెడలఁబోసికొనెడు=చెప్పుకొనునట్టి, ఘనము=గొప్పది, 48 మహోత్సవంబు=గొప్పసంతోషము, పడయున్=పొందును, కుందుక్=విచారించును, జెఱవారికిక్=ఇతరులకు, 49 సదమలమతిక్=నిర్మలమైనబుద్ధితో, వినయంబు=అణఁకువ, తేజరిల్లుక్=ప్రకాశించును 50 సోదరీప్రేమ=తోఁబుట్టువులయందు ననురాగము, సుదతినీతి=స్త్రీనీతి.

శ్రీమత్పరదేవతాయైనమః.

# స్త్రీధర్మబోధిని.

## 3 వ తరగతి పద్యములు.

### పతిభక్తి.

క॥ పతియే గురుఁడును దైవము
పతియే కాపాడువాఁడు పతియే గతియౌఁ
బతియే సర్వంబును నగుఁ
బతియే ముదమిచ్చువాఁడు పడఁతుల కిలలోన్॥ 1

గీ॥ మగువ కెందఱుబంధువుల్ మగనికంటెఁ
జూడఁదరువాతివారలు సుమ్మి భర్త
యనఁగఁ బోషించువాఁడని యర్థము మదిఁ
దలఁచి యాతని సేవింపవలయుఁజుమ్మి॥ 2

సీ॥ కలిమిగలవాఁడు సొగసుగలుగువాఁడు
లేనివాఁడును సొగసులేనివాఁడు
నైననాతనిభక్తితో నరయుచుండు
వనిత యశమొందుఁ దా నిహపరములందు॥ 3

---

1 పతి=మగఁడు, గతి=దిక్కు, సర్వంబును=అంతయును, ముదము=ఆనందము, ఇలలోన్=భూమిలో, 2 మగువకున్=ఆడుదానికి, సేవింపవలయున్=కొలువవలెను, 3 కలిమి=సిరి, సొగసు=చక్కఁదనము, ఇహపరములందున్=ఈలోకమునందు స్వర్గలోకమందు.

గీ॥ సుగుణమును బతిభక్తియు సుందరులకుఁ
జక్కఁదనమును ధనమును సర్వభూష
ణములనగు నవ్వి గలిగిన నాతియనఁగ
దైవమనఁగను లేదు భేదంబుదలఁప॥ 4

గీ॥ పతికి నెదురాడకెప్పుడు నతఁడు సెప్పు
పనులు వేవేగఁ జేయుచు వలయునప్పు
డన్నపానంబులొసఁగుచు నతనియందు
భక్తిగలిగినపడతికి ముక్తి లేదె॥ 5

గీ॥ భర్తకొక వేళఁ గోపము వచ్చెనేనిఁ
దానుగినుక వహింపఁగఁదగదు పరులఁ
బరుసపుంబల్కు లెప్పుడు పలుకఁదగదు
పొరుగుటిండ్లకుఁబలుమాఱు పోవఁదగదు॥ 6

గీ॥ భర్త దగ్గఱనుండినప్పటికి నొరుని
మొగముఁగనుగొని వచియింపఁదగదు గాని
మగఁడు పొరుగూరికేగు సమయమునందు
వచ్చు పెద్దలఁ బూజింపవలయుఁజుండి॥ 7

---

4 సుగుణము=మంచిగుణము, సుందరులకున్=స్త్రీలకు, సర్వభూషణములు=అన్ని యలంకారములు, నాతి=స్త్రీ, 5 ఎదురాడక=మాఱుపలుకక, వేవేగన్=త్వరగా, అన్నపానంబులు=భోజనము నీరును, ఒసఁగుచున్=ఇచ్చుచు, ముక్తి=మోక్షము. 6 కినుక=కోపము, పరులన్=ఇతరులను, పరుసపుంబల్కులు=కఠినపు మాటలు, పొరుగుటిండ్లకున్=దగ్గరనుండుగృహములకు, పలుమాఱు=పెక్కుసార్లు, 7 ఒరుని మొగము=ఇతరునిముఖము, వచియింపఁదగదు=పలుకఁగూడదు, ఏగుసమయమునందు=వెళ్లునప్పుడు.

గీ॥ ఎంతకోపంబు మగనికి హెచ్చియున్న
నంతయోరుపువలయును గాంతలకును
మగువలకు సౌఖ్యసాధన మార్గమిందు
వెదకఁగా నోర్పుకంటెను వేఱులేదు॥ 8

గీ॥ మగఁడు తా నెంతప్రీతితో మగువఁజూచు
నువిద తానంత భయభక్తులొప్ప మగని
నరయవలయును జనవిచ్చెననుచు నెత్తి
నెక్కఁగూడదు చెడుదాన నిహపరములు॥ 9

గీ॥ కర్జములు సేయునప్పుడు కార్యములను
దలఁచునెడఁ గష్టసుఖములు గలుగునపుడు
భర్తకనుగుణముగనుండ వలయుఁబడతి
భార్యయర్ధాంగియనుమాట పాడిగాఁగ॥ 10



కలిమి.

గీ॥ కలిమిగలకాలమందును గర్వపడక
దీనులగు చుట్టములను నిందింపకుండి
బీదలందును దయగల్గి ప్రీతితోడఁ
గనుచునుండెడి పడఁతి గీర్తి నివహించు॥ 11

---

8 ఓరుపు = శాంతము, సౌఖ్య...ర్గము = సుఖమునకు హేతువైన త్రోవ, ఇందున్ = ఈలోకమందు. 9 ఉవిద = స్త్రీ, చనవు = అనురాగము, నెత్తిన్ = తలను, దానన్ = అందుచే, 10 కర్జములు = పనులు, తలఁచునెడన్ = ఆలోచించునప్పుడు, అనుగుణముగన్ = తగునట్లుగా, అర్ధాంగి = సగముశరీరము గలది, పాడి = న్యాయము, 11 గర్వపడక = త్రుళ్ళిపడక, దీనులు = దరిద్రులు, నిందింపక = దూషింపక, బీదలు = దరిద్రులు, వహించున్ = పొందును.

గీ॥ కలిమి శాశ్వతమైయుండఁ గలదటంచు
గర్వపడకుమీ యదియుండు కాలమందె
దానధర్మములను జేయఁదలఁపవలయు
దీపముండఁగ యెడ నిల్లుదీర్చురీతి॥ 12

క॥ సిరి తనకబ్బినయెడ సతి
పరవనితల నిందసేయఁ బాల్పడక యనా
దరణముసేయక యేకో
దరలవలెన్ జూడవలె నుదారమనసుచేన్॥ 13

గీ॥ కరతలంబుననుండు పాదరసమువలెఁ
జలనమొందుచునుండును గలిమిగాన
నదియె శాశ్వతమనక నెమ్మదివహింప
వలయు నెప్పుడు మీరలు వనితలార! 14

గీ॥ కలిమికిని రెండుత్రోవలుగలవు తాను
గడుపునిండఁగఁ దినుటయుఁ గలుగుకొలఁది
లేనివారికిఁ బెట్టుట లేనియెడలఁ
గలిమియుండిన లేమియె కాంతలార॥ 15

---

12 శాశ్వతము=ఎల్లప్పుడు నుండునది. తా॥ దీపమున్నప్పుడే యిల్లుచక్కఁబెట్టికొన్నట్లుగా, సిరియున్నప్పుడే ధర్మముచేయవలెను, 13 అబ్బినయెడన్=కలిగినప్పుడు, పాల్పడక=ఇష్టపడక, అనాదరణము=చులకనసేయక, ఏకోదరలవలెన్=ఒక్కకడుపునఁబుట్టినవారివలె, ఉదారమనసుచేన్=గొప్పమనస్సుచే, 14 కరతలంబునన్=అరచేతిలో, చలనము=కదలిక, నెమ్మది=మంచిమనస్సు, 15 కలుగుకొలఁదిని=ఉన్నంతలో, లేనివారికి=దరిద్రులకు.

గీ॥ ధనమదంబున మత్తతఁ దాకిభర్తృ
సేవ మఱువంగ రాదిక సిరినొసంగు
దేవునెడభక్తి విడనాడఁగావలవదు
పడఁతులట్లైనఁ గీర్తినిబడయఁగలరు॥ 16

ఆ॥ మనకుధనముగలిగె ననుచును మగనికి
సలుపఁగఁ దగినయుపచారములను
సేవకులకుఁ జెప్పఁగావలవదు తామె
స్వయముగానొనర్ప వలయుఁజుండి॥ 17

ఆ॥ కలిమి మెఱుపుఁదీగె కరణినుండును దాని
కొఱకు సంతసంబు గూడదది న
శించు కాలమందుఁ జింతయుఁగూడదు
. బ్రతుకు బండికల్లువంటిది గద॥ 18

ఆ॥ అనుచుఁదలఁచి మీరలంగనలార మీ
పనులయందసడ్డపడకుఁ డేమి
కాలమొక్క రీతిగానుండదోడల
బండ్లు నోడలవ్వ బండ్లవచ్చు॥ 19

16 ధనమదంబునన్=ధనముగలదనుగర్వముచే, తాకి=పొంది, భర్తృసేవ=మగని కొలువు, విడనాడఁగా=విడిచి పెట్టఁగా, వలవదు=తగదు. 17 సలుపఁగఁద......ములను=చేయదగినసేవలను, సేవకులకున్=నౌకరులకు, ఒనర్పవలయున్=చేయవలయును, 18 నశించుకాలమందున్=పోయినప్పుడు, చింత=దుఃఖము, తా॥ బండిచక్రము మీఁదిభాగము క్రిందకు, క్రిందిభాగముమీఁదకు వచ్చినట్లుబ్రతుకు, ఒకప్పుడు మంచియవస్థను, ఒకప్పుడు చెడ్డయవస్థనుబొందును. 19 అంగనలార!=కాంతలారా!, అసడ్డ=అశ్రద్ధ, తా॥ పడవలు బండ్లమీఁదను, బండ్లు పడవలమీఁదను బోవునట్లుగా, ధనవంతులు, దరిద్రులుగా దరిద్రులు ధనవంతులుగా కాలముననుసరించియగుదురు.

ఆ॥ ధనము పూర్వపుణ్యమునఁ గల్గెనని యెంచి
పుణ్యకార్యములను బొనరఁ జేసి
కాంతభక్తివ్రతముగా నెంచియుండుఁడీ
కాంతలార! కీర్తి గలుగు మీకు॥ 20



లేమి

గీ॥ లేమి యది చూడఁగా దరిలేని జలధి
కండ్లఁ గప్పెడు తుదలేని కటికచీఁక
టియును నారని కార్చిచ్చు వ్యయములేని
పాపపుంజంబు గాదె యో పడఁతులార!॥ 21

గీ॥ బొమ్మలో పలనాటు బాణమ్ము విడక
యుండెడు పిశాచి నదిమధ్యనుండు నావ
యాఁకటికిఁ బుట్టినిల్లసత్యములకు నికి
పట్టు దానికి సరిలేదు వనితలార॥ 22

గీ॥ దానిఁ గడపంగఁ బతియందు దైవమందు
భక్తి యేతక్క వేఱొక్కవలను లేదు
వారి నెల్లెడ సేవించు వనిత నెపుడు
లేమి యనునది బాధింపలేదు నిజము॥ 23

---

20 పుణ్యకార్యములను = మంచిపనులను, కాంతభక్తి = పతిభక్తి, వ్రతము = నోము. 21. లేమి = దారిద్ర్యము, దరి... జలధి = అంతములేని సముద్రము వంటిది, తుద... చీకటి = అంతములేని గొప్పచీకటివంటిది, ఆరని కార్చిచ్చు = ఆరిపోవని యడవినిప్పువంటిది, వ్యయములేని పాపపుంజంబు = నాశనములేని పాపము వంటిది. 22 బాణమ్ము = [illegible]పు, పిశాచి = దయ్యము, నది... నావ = ఏటిలోనున్న పడవవంటిది, అసత్యములకు నెక = కల్లలకు, ఉనికిపట్టు = చోటు, 23 వలను = ఉపాయము.

గీ॥ ధనముఁగోరుట సహజంబు వనితలకును
గాన ధనవంతుఁడగుభర్త గారవించుఁ
గాంత, యిదిచూడఁ బతిభక్తి గాదు లేమి
యందెపడఁతిఁకెఁ బతిభక్తి యర్హమగును. 24

గీ॥ కలిమిలేములు గతజన్మ కర్మఫలము
లనుచుఁదలఁచి మగనిలోపమునక యతఁడు
కష్టపడి తెచ్చుదానితోఁ గాలముగడ
పెడుపతివ్రత నేమిచేసెడును లేమి॥ 25

గీ॥ భర్త దారిద్ర్యవంతుఁడై పరగినపుడు
నగల కాతనిబాధింపఁ దగదుతలఁప
నెల్లభూషణములకంటె నెక్కుడగును
జుమ్మి పతిభక్తి యనుభూషణమ్ము సతికి॥ 26

గీ॥ చంద్రమతియును దమయంతిసాధ్వియైన
ద్రౌపదియు లేమివచ్చినతటినిఁ బతుల
తోడఁగష్టములంబడి తుదకుఁగలిమిఁ
బడసిరని వింటిమేకద? పడఁతులార॥ 27

గీ॥ కాన నవ్వారిసుగుణంబు గాంచిమీరు
లేమివచ్చినదని చింతలేకయుండి

---

24 సహజంబు=సైజము, గారవించుక్=గౌరవించును, అర్హము=తగినది, 25 గత...ఫలములు=క్రిందటిజన్మమందు చేసినపనులయొక్కలాభములు, 26 దారిద్ర్యవంతుఁడు=లేనివాఁడు, బాధింపఁదగదు=వేచఁగూడదు, భూషణము=అలంకారము, 27 సాధ్వి=పతివ్రత, పడసిరి=పొందిరి, 28 భాగ్యము=ఐశ్వర్యము, సుగుణంబు=మంచిగుణము.

భర్త కెప్పుడు నెమరుగాఁ బల్కకతని  
భక్తిఁ జూడుఁడు దానిచే భాగ్యమబ్బు॥ 28

గీ॥ కలిమి లేనట్టియెడ బంధువులగృహంబుఁ  
జేరఁగూడదు పతివీడి నారులార!  
కలియొ గంజియొ యొకపూటఁ గలిగినంత  
త్రాగి యింటనెయుండుట ధర్మమగును॥ 29

గీ॥ నారు వోసినయాతఁడు నీరువోయ  
కుండునా? చీమజీవించుచుండ లేదె  
లేమిమాత్రము శాశ్వతమేమి? కీర్తి  
శాశ్వతముగానఁ బతిభక్తి సల్పుఁడెపుడు॥ 30

దైవభక్తి.

గీ॥ ఎవఁడుపుట్టించు లోకంబు నెవఁడుపెంచు  
నెవఁడునశియింపఁజేయు మహేశునతని  
మొదలు తుదలేనివానిని సదమలమతి  
భజనసేయుచునుండుఁడీ పడఁతులార?॥ 31

గీ॥ కష్టకాలంబునందును గాంతలార!  
రామ! రామా! ముకుంద! నారాయణా! హ  
రీ! యటంచును స్మరణముసేయనొక్క  
మాఱుకష్టంబునాటదు మనసులోన॥ 32

---

29 గృహంబు = ఇల్లు, వీడి = విడిచి, ధర్మము = పాడి, 30 తా॥ పుట్టించినవాఁడు తిండిపెట్టకచంపునా? చంపఁడు. లేమిమాత్ర మెల్లప్పుడు నుండునా? ఉండదు. కీర్తియొక్కటి, శాశ్వతము, దానికిఁ బ్రీతిం బొందుఁడు. 31 మహేశుని = ఈశ్వరుని, సదమలమతిని = నిర్మలమైనబుద్ధితో. 32 కష్టకాలము = ఆపత్కాలము, స్మరణము = ధ్యానము.

గీ॥ తల్లిగర్భంబులోపల నెల్లయవయ
వంబులం గల్గి భూమిపైఁ బడియుఁ బెఱిఁగి
జ్ఞానముం గల్గియుంటి మెవ్వానికరుణ
వాని భజియింపవలయును వనితలార.॥ 33

గీ॥ కదలలేనివి మొసరంగఁగలవి పాకఁ
గలవి పఱుగెత్తునవి యొన్నికలవు జంతు
వులును వానికి మనకేమి కలదు భేద
ముక్కజ్ఞానంబె తక్క నోయువిదలార॥ 34

గీ॥ కాన జన్మంబు వ్యర్థంబుగా నొనర్ప
కట్టిజ్ఞానంబు మనకిచ్చు నామహేశు
కథలనుడువుచుఁ గాలంబుగడపుఁ డట్లు
గానిచోఁ బశువులముగాఁ గామె మనము॥ 35

గీ॥ ధరణినెవ్వఁడు పెక్కువిధంబులయిన
జంతుజాతులఁ గల్పించి సర్వమునకుఁ
దగిన యాహారములకు నాధారములను
జేసె నాసర్వశక్తుని సేవఁగొనుఁడు॥ 36

---

33 అవయవంబులన్ = కాళ్ళుచేతులు మొదలగు నింద్రియములను, ఎవ్వానికరుణన్ = ఎవ్వనిదయచే, 34 జ్ఞానంబు = ఎఱుక, తక్కన్ = విడిచి, 35 వ్యర్థంబుగాన్ = ప్రయోజనములేనిదానినిగా, కథలన్ = చరిత్రలను, నుడువుచున్ = చెప్పుచు, 36 ధరణిన్ = భూమియందు, ఆహారములకున్ = భోజనములకు, ఆధారములను = ఏర్పాటులను, సర్వశక్తుని సేవన్ = అన్నిసామర్థ్యములుగలదేవుని సేవ, కొనుఁడు = గ్రహింపుఁడు.

గీ॥ భూమి యగ్నియు నాకాశమును జలంబు
గాలియును దైవమునకు నాకారములగు
నెల్లజంతువులకులోన నిమిడియుండు
నతఁడు వానికి వేఱైన యదియ లేదు॥ 37

గీ॥ ఇంటనుయ్యాలలోనుండు చంటిబిడ్డ
నూర వెదకినరీతిగా నువిదలార!
మనమనంబుననుండు దేవుని భ్రమించి
వెదకుచుంటిమి యెల్లెడ వెఱ్ఱిచేత॥ 38

గీ॥ సముఁడుగానుండు నెవ్వఁడు సర్వమందు
నెవనికిఁ భక్తులమనంబె యిల్లైవండు
దీనబంధుఁడటంచుఁ గీర్తి నివహించె
వాని మఱువకుఁ డెప్పుడు వనితలార!॥ 39

గీ॥ ఎవని నెవ్వరెఱుంగరో యెవ్వఁడెల్ల
వారినెఱుఁగునో యెవనికి మారులేదొ
యెవఁడు ప్రళయంబునందొక్కఁడే వెలుఁగు
నతనిఁ బరమేశుఁ దలఁపుఁడీ యబలలార!॥ 40

---

37 అగ్ని=నిప్పు, ఆకాశము=ఆకసము (శూన్యము,) జలంబు=నీరు, ఆకారములు=రూపములు, ఇమిడియుండును=ఒదిగియుండును, 38 ఊరన్=గ్రామమునందు, భ్రమించి=భ్రాంతిచెంది, ఎల్లెడల=అన్నిచోట్ల. 39 సముఁడు=సమానుఁడు, దీనబంధుఁడు=దిక్కులేనివారికి చుట్టము. 40 ఈడు=సమానుఁడు, ప్రళయంబునందున్=అంతయు నశించుకాలమునందు, పరమేశున్=ఈశ్వరుని, తలఁపుఁడీ=ధ్యానము చేయుఁడీ.

సీ॥ చిన్నబీజంబునందుండె చెట్టు పెఱుఁగు
మహిమ యెట్లుండెనో శిలామధ్యమందు
గప్ప జనియించె నెట్టులొకప్ప బ్రతుకు
నహహ దైవవిచిత్ర మేమనఁగవచ్చు॥ 41

సీ॥ కంటికినిఁ గట్టు గృహకర్త యెట్లులుండు
నట్టి జంగమస్థావరాత్మకమగు
సర్వలోకము నిర్మించు సర్వశక్తుఁ
డొకఁడు కలఁడంగవలెనని యూహఁగొనుఁడు॥ 42

సీ॥ ఎన్నిజన్మములు పుట్టితిమింక నెన్ని
మాఱు పుట్టఁగవలయునో మనుజజన్మ
మెత్తినందుల కాజగదీశునందు
భక్తి సల్పుట జూడంగ ఫలము గాదె॥ 43

సీ॥ బాల్య యౌవన వార్ధకావస్థలందు
మరణ మెందైనఁ దప్పదీమాట యెఱిఁగి
ధర్మమార్గంబునన్ బ్రవర్తనము సేయఁ
మెలఁగవలయు వివేకచిత్తంబుతోడ॥ 44

---

బీజంబునందుండె = విత్తులోన, మహిమ = శక్తి, శిలామధ్యమందున్ = రాతిలోన. 42 గృహకర్త = ఇల్లుకట్టువాఁడు, జంగ...కము = మనుష్యులు చెట్లు మొదలగునవి గలిగిన, సర్వలోకము = అయిన సమస్తప్రపంచము, నిర్మించు = చేయును, ఊహ = తలఁపు. 43 మనుజజన్మము = నరజన్మము, జగదీశునందు = భగవంతునందు ఫలము = ప్రయోజనము. 44 బాల్య...లందున్ = చిన్నతనము జవ్వనము ముసలితనములందు, వివేకచిత్తంబుతో = మంచి జ్ఞానముగల మనస్సుతో.




గీ॥ చదువుచెప్పెడు గురులందు సంతతంబు
భక్తి విడనాడఁగారాదు బాలికలకుఁ
గన్న జనకునికంటెఁ జానెన్నిరెట్లొ
గురుఁడె యధికుఁడటందురు కోవిదులును॥ 45

గీ॥ పాఠశాలలనాతఁడు పాఠములను
జెప్పువేళల శ్రద్ధతోఁ జెవియొసంగి
వినుచుఁ జెప్పినవానిని విసుగులేక
పఠనసేయుచునుండుఁడీ బాలలార! ॥ 46

ఆ॥ కల్లలాడఁబోక గర్వింపఁగారాక
తప్పుసేయఁబోక తరుణులార!
సత్యమాడుఁ డణఁగి సంచరింపుఁడు మంచి
పనులుసేయుఁ డొజ్జపల్కులు విని॥ 47

ఆ॥ విద్యవలన మీకు వినయంబుగల్గును
దానివలన మంచితనము గల్గు
దానభర్తృభక్తి దైవభక్తియుఁ గల్గుఁ
గానఁ జదువుఁ డతని యానవడసి॥ 48

---

45 సంతతంబు=ఎల్లప్పుడు, కోవిదులు=పండితులు. 46 శ్రద్ధతోఁ=ఆసక్తితో, పఠన=వల్లన. 47 కల్లలాడఁబోక=అసత్యమాడక, ఒజ్జ=గురువు. 48 వినయంబు=అణఁకువ, ఆన=సెలవు, పడసి=పొంది. భర్తృభక్తి=మగనియందు భక్తి.

గీ॥ వినుఁడు మూఁడవతరగతి పిల్లలారా!
భక్తితో మీరు గురువుల పల్కులు విని
చదువుఁడీ నీతిపద్యముల్ సదమలమతిఁ
దెలివి పతిభక్తి దైవభక్తియును గలుగ॥ 49

గీ॥ మొదలఁ బతిభక్తి కలిమిలేములయెడ నడ
వడియు సర్వేశ్వరునియందు భక్తి గురువు
లందు భక్తియుఁ గలిగిన యతివనీతి
వ్రాసె మల్లాది సూర్యనారాయణ కవి॥ 50

---

49 సదమలమతిఁ = మంచిబుద్ధిచేఁ. 50 తా॥ పతిభక్తి, కలిమిలేముల యందు నడచుకొనువిధము, దేవునియందు, గురువులందు భక్తి, అను నయిదు భాగములచే వ్రాసెను.



# శ్రీవిక్టోరియాచక్రవర్తినిచరిత్రము.

## 4 వ తరగతి బాలికలకుఁ బద్యములు.

వ॥ హిందూదేశము నేలిన చక్రవర్తులలో నెవ్వరు నిట్టి రాజ్యంబు చేయలేదని ప్రజలానందించున ట్లేకచ్ఛత్రంబుగా మన హిందూదేశముఁ బాలించిన శ్రీవిక్టోరియా మహాచక్రవర్తిని, కెంటుప్రభువుగారికి విక్టోరియా మేరీ లూయిసా ప్రభ్వియందు 1819 వ సంవత్సరము మెయి నెల 24 వ తేదిని తెల్లవారుజామున సూర్యోదయంబగు నట్టియెడ.—

గీ॥ మంచివారినిఁ బ్రోవ దుర్మార్గజనుల
శిక్షణ మొనర్పఁ బుట్టుకఁ జెందినట్టి
దైవమేయన వాని తేజోవిశేష
మొప్ప జన్మించె నానందమొంద జనులు॥ 1

వ॥ అట్లు పుట్టి నానాట శుక్లపక్ష చంద్రకలఁబోలి పెరిగి యైదేండ్లు వచ్చినది మొదలుగా, నియతకాలంబున నాయా యుపాధ్యాయులయొద్దఁ దల్లి యానతిచొప్పున విద్యాభ్యాసంబు చేయుచు.

---

వ॥ రాజ్యంబు=ఏలుబడి, ఏకచ్ఛత్రంబుగాన్=ఒక్క గొడుగు కలుగునట్లుగా, సూర్యోదయంబు=పొద్దుపొడుపు. 1 దుర్మార్గజనులన్=చెడ్డవారిని, శిక్షణము=దండనము, ఒనర్పన్=చేయుటకు, తేజోవిశేషము=కాంతియొక్క యతిశయము, జన్మించెన్=పుట్టెను. తా॥ మంచివారిని రక్షించుటకు, చెడ్డవారిని శిక్షించుటకుఁ బుట్టిన భగవంతుఁడే యనునట్లు రాణి యుండెను. వ॥ శుక్లపక్షచంద్రకలఁబోలి=శుక్లపక్షమందలి చంద్రుని రేఖవలెనె, నియతకాలంబునన్=ఏర్పడిన సమయమందు, ఉపాధ్యాయులు=చదువు చెప్పువారు. ఆనతి=ఆజ్ఞ. విద్యాభ్యాసంబు=చదువు నేర్చుకొనుట.

గీ॥ గ్రీకుభాషయు లాటి నింగ్లీషు ఫ్రెంచి
యును నిటాలియు జర్మనీయ నెడు నాఱు
భాషలను గణితశాస్త్రము పరమధర్మ
శాస్త్రమును గానవిద్యయుఁ జక్కనేర్చె॥ 2

వ॥ ఇట్లు విద్యాభ్యాసంబొనర్చుచుఁ జిన్ననాఁటనుండియు నయారసంబుగాఁగ వర్తించుచుఁ బ్రతిదినము తాను బండిలోఁగాని నడకనుగాని పురవిహారంబు సలుపుచు నడుమ నడుమ—

గీ॥ బొమ్మలం జెప్పికొనుటకై యమ్మయిచ్చు
ధనము నసుదారి బీదలకును నొసంగు
నహాహా సుగుణంబులేమని యనఁగవచ్చుఁ
బువ్వు పుట్టుచు గంధంబుఁ బొసఁగుఁగాదె॥ 3

వ॥ ఇట్లు రాజ్ఞీచిహ్నములం జూపుచుఁ బెరిగి పండ్రెండేండ్లు వచ్చినతఱి నొకనాఁడు తనకు రాఁబోవు మహారాజ్ఞీస్థానమునుఁగురించి తనతల్లితో నాలోచించిన యుపాధ్యాయి వ్రాసి తాను జదువుకొను పుస్తకములోఁ బెట్టిన రాజకుటుంబముయొక్క వంశవృక్షముగల కాగితమును దన నియత

---

2 పరమ...శాస్త్రము = మంచి నీతివిద్యను, గానవిద్య = సంగీతము.

వ॥ పురవిహారము = నగరమందు సంచారము (అనివారు) 3 నడుదారికి = త్రోవలో. గంధంబు = పరిమళము, పొసఁగుఁ = ఇచ్చును.

వ॥ రాజ్ఞీచిహ్నములన్ = ఏలికచిన్నెలను, స్థానము = పదవి, ఉపాధ్యాయి = చదువుచెప్పునట్టి యాడుది, రాజకుటుంబము = రాచవంశము, వంశవృక్షము = కులమంతటి మొగవారిక్రమము.

కాలంబునఁ జూచి చదివి యిది యేమని యుపాధ్యాయి నడిగి తెలిసికొని గర్వపడక యామెతో—

గీ॥ నీవుచెప్పినరీతిగా నీతివిద్య
నభ్యసించెద నడవడియందు నెపుడు
పాడిదప్పను సత్యమే పల్కుచుందు
యోగ్యతను గందుననుచుఁ దానూఁది పలికె॥ 4

గీ॥ మఱియుఁ దల్లికి గుర్వికి మాఱుపలుక
కెప్పుడు నసత్యమాడక యెల్లయెడల
విద్యలన్ నేర్చికొనుచు వివేకమొప్ప
జరపె విక్టోరియా రాణి శైశవదశ॥ 5

వ॥ పిదప 18 సంవత్సరముల ప్రాయమునొందిన యామె తన తండ్రివంశమునఁ బురుషులు లేకపోవుటచే తానే రాజ్య భారము వహింప 1838 వ సంవత్సరము జూను నెల 28 వ తేదీని దివ్యమహోత్సవంబునఁ బట్టాభిషిక్తయై కిరీట ధారణంబు చేసి రాజ్యంబు నిర్వహించుచు నొకటి రెం డేండ్లు గడపి వివాహ కౌతూహలయై.

---

4 అభ్యసించెదన్ = నేర్చుకొనెదను, సత్యము = నిజము, యోగ్యత ను = మంచితనమును, ఊది = ఒత్తి. 5 గుర్వికిన్ = చదువుచెప్పుదానికి, మాఱుపలుకక = ఎదురాడక, వివేకము = తెలివి, శైశవదశన్ = చిన్నతనము ను. వ॥ పురుషులు = మగవారు, రాజ్యభారము = ప్రభుత్వము యొక్క [illegible], దివ్యమహోత్సవంబునన్ = మంచివేడుకతో, కిరీటధారణంబు = కిరీటము తాల్చుటను, నిర్వహించుచున్ = చేయుచు, వివాహ...లయై = పెండ్లియందు వేడుకకలదియై.

చ॥ తనకును బాల్యమందె మనసిచ్చినవానిని విద్యలెల్లనే
ర్చినయతని మనోహరశరీరుని ధీరుని మేనమామకుం
దనయునిఁ బెండ్లిచేసికొన ధార్మికమంత్రిసభాంతరాళమం
దునతనకోరికఁ జెప్పి మాపితొందరఁజెందననుజ్ఞఁ జెందియున్॥

వ॥ తరువాత 1840 వ సంవత్సరము ఫిబ్రవరినెల 10 వ నా డాల్బర్టు నామంబుగల యాప్రభువరుని వారి దేవాలయంబున సమస్త మంత్రిజనమధ్యంబున మహోత్సవంబుతోఁ బెండ్లియాడె.

గీ॥ సర్వదేశంబు నేలెడు సార్వభౌమి
ననెడుగర్వంబు కొంచెమే నాత్మలేక
దైవసాక్షికముగ నేను ధర్మవిభుని
కనుగుణంబుగ నడచెద ననుచుఁ బలికె॥ 7

వ॥ ఇట్లు యథోక్తముగాఁ బెండ్లియైన పిదప నప్పతివ్రతామణి—

---

6 బాల్యమందున్ = చిన్నప్పటినుండి, మనోహరశరీరుని = సొగసైన మేనుగలవానిని, ధార్మిక...రాళమందు = న్యాయముచెప్పుమంత్రులసభలో అనుజ్ఞ = అంగీకారము. వ॥ దేవాలయంబునన్ = గుడిలో 7 సార్వభౌమిని = దేశమంతయు నేలుదానను, దైవసాక్షికముగన్ = దేవుఁడుసాక్షిగా, ధర్మవిభునికిన్ = మగనికి, అనుగుణంబుగన్ = తగునట్లు, పతివ్రతామణి = పతివ్రతలలో శ్రేష్ఠురాలు, ఆత్మన్ = మనస్సునందు.

గీ॥ రాజ్యభారంబునొకయెత్తు రమణునందు
భక్తియొకయెత్తు గాఁబూచిపతిని స్వల్ప
కాలమునగౌరవార్హునిఁ గానొనర్చె
దేశమంతెల్లనతనికీర్తియు వెలుంగ॥ 8

గీ॥ రాజ్యతంత్రంబులందైన రాణియతఁడు
సత్యవాది యటంచునిశ్చయముపడసి
యతని యాలోచనంబునే యనుసరించి
పోవుచుండును జనులు సంమోదమొంద॥ 9

గీ॥ అతనిమాటకు నెపు డెదురాడఁబోక
యతని నొకనిముసము విడనాడలేక
యతనిసగమేనురీతిగా నామెయుండె
భార్యయర్థాంగి యనుమాట పాడిగాఁగ॥ 10

గీ॥ తనదుప్రాణంబుదీయంగఁ దలఁచునట్టి
దుష్టబుద్ధులఁ బెక్కండ్ర దూరదేశ
మందునివసింప నియమించె నందునొక్క
దుష్టునైననుజంపంగ నిష్టపడక॥ 11

---

8 రాజ్యభారంబున్=ప్రభుత్వము యొక్క బరువును, రమణునందున్=మగనియందు, స్వల్పకాలమునన్=కొంచెము కాలములో, గౌరవార్హునిఁగాన్=గౌరవింపఁదగినవానినిఁగా, ఒనర్చెన్=చేసెను. 9 రాజ్యతంత్రంబులందున్=రాచ పనులయందు, సత్యవాది=నిజము చెప్పువాఁడు, సంమోదము=ఆనందము, 10 అతని...రీతిగా=మగనియొక్క సగముశరీరమువలె, అర్థాంగి,=సగముశరీరముగలది, 11 దుష్టబుద్ధులన్=చెడుబుద్ధిగలవారిని, నియమించెన్=ఏర్పాటుచేసెను.

గీ॥ పాపుఁడైతన్నుఁ జంపఁ దుపాకిఁగాల్చి
మరణదండనవిధి నొందుమనుజుఁడొకఁడు
మూర్ఛపడెనని వినిజాలిఁ బొందియామె
వానివిడిపించి పరదేశవాసిఁ జేసె॥ 12

గీ॥ సర్వమునరత్నగర్భకు సాటియైన
సువతి విక్టోరియారాణిసుతులనల్వు
రను గుమార్తెలనైదుగురినిఁ గనె నవ
రత్నములపోలిక మనోహరత్వమొంద॥ 13

గీ॥ రాజ్ఞినను గర్వమును జెంద రాకపోల
దాదులెందఱునుండినఁ దానెపాల
నిచ్చితనబిడ్డలను బెంచె నెలమితోడ
మనధనాఢ్యులభార్యల మాడ్కిఁగాక॥ 14

గీ॥ పిల్లలను బెంచుటకుఁ దగుఁదల్లియనఁగ
నామెనున్నుఁగ వర్ణించి యవలజెప్ప
వలెనులోకంబునందలి వనితలందు
నామెవలె శాంతసతి యుండినట్టులైన॥ 15

---

12 మరణదండనవిధిన్ = ఉరిశిక్షను, మనుజుఁడు = మనుష్యుఁడు, పరదేశవాసిన్ = ఇతరదేశమందుండు వానినిఁగా. 13 సర్వమునన్ = అన్నిటిలో, రత్నగర్భకున్ = భూమికి, సువతి = మంచిదంతములుగలరాణి, సుతులన్ = కొడుకులను, మనోహరత్వము = ఇంపు. 14 ధనాఢ్యులు = ధనముచేగొప్పవారు. 15 అవలన్ = పైని, శాంతసతి = ఓర్పుగలపతివ్రత.

గీ॥ రాజ్యకార్యంబులందు నశ్రద్ధవడక
యెంతపనియున్నఁ జేయుచు నంతచదువు
చెప్పువారున్నఁ దీరినయప్పుడెల్ల
విద్య నేర్పుచునుండును బిల్లలకును॥ 16

గీ॥ మహితరాజ్యంబు గలదనిమదము గలిగి
జనులసేమంబునందు నసడ్డవడక
తనకుఁబుట్టిన వారికంటెనుమహాను
రాగమునఁ జూచుచుండెను రాష్ట్రజనుల॥ 17

గీ॥ బీదలకుటీరములకును బ్రేమవెడలి
బాలురకురోగులకుఁ బెద్దవారికాట
వస్తువులనౌషధముల దుప్పటులనిచ్చి
వచ్చుటయె యామె దయకానవాలుసుండె॥ 18

గీ॥ అల్పధనమున గర్వించు నతివలవలె
నర్థహీనుల గృహముల కరిగి వారిఁ
బలుకరించుట తప్పని తలఁపకామె
యరిగి యవ్వారి సేమంబు నరయుచుండు॥ 19

---

16 అశ్రద్ధపడక = అలసపడక, చదువుచెప్పువారున్నన్ = గురువులు న ను 17 మహితరాజ్యంబు = గొప్పప్రభుత్వము, మదము = మత్తత, జనుల సే ంబునందున్ = నరులబాగునందు, మహానురాగమున్ = మిక్కిలిప్రీతితో, 18 కుటీరములకున్ = చిన్నయిండ్లకు, ప్రేమన్ = అనురాగముతో, వెడలి = వెళ్లి, 19 అర్థ...హములకున్ = పేదరాండ్రయిండ్లకు, సేమంబు = క్షేమము ను.

గీ॥ కష్టమెంతటివారికిఁ గలుగునేడు
పలుకు నిజమనుటకు నామె భర్తనాల
గవసుతుఁడు మృతులవుట యుదాహరణము
వీనికంటెను దుఃఖముల్ వేలుగలవె॥ 20

గీ॥ అక్కటా ? యామె వైధవ్యమనెడుజలధి
బుత్రశోకంబు ననుసుడి మునిఁగిపోయి
తల్లి మొదలగు నాప్తబాంధవులచావు
లనెడు కెరటంబులంబడి యరిగియరిగి॥ 21

గీ॥ ఎట్టులో ధైర్యమను నావ నెక్కిదరికి
వచ్చి తనదుఃఖములకంటెఁ బ్రజలదుఃఖ
ములకు మిక్కిలి యడలు నా ముదితకంటె
దీనులంగావ వేరెయొక్క దేవుఁడగునె॥ 22

గీ॥ బోస్గ్గనితప్పు నెడఁజచ్చి పోవుజనుల
తల్లులకు భార్యలకును దాఁ దంతివార్త
లంపి వేలకొలంది ద్రవ్యంబు నంపు
నామెయే దీన బంధురాలగుటనిజము॥ 23

---

20 మృతులు=చచ్చినవారు, ఔట=అగుట, ఉదాహరణము=దృష్టాంతము, దుఃఖముల్=కష్టములు. 21 వైధవ్య...లధిన్=మగఁడులేకపోవుటయనుసముద్రములో, పుత్రశోకంబు=కుమారుఁడు పోవుటవల్లనదుఃఖము, ఆప్తబాంధవులు=ఇష్టులైనబంధువులయొక్క, అరిగియరిగి=పోయి, పోయి. 22 నావన్=పడవను, దరికిన్=ఒడ్డునకు, అడలునాముదిత=విచారించునట్టియారాణి, దీనులన్=పీడితులను. 23 తంతివార్తలు, తీగజాబులను.

గీ॥ ఇతరధనమున కెప్పు డపేక్షపడని
దనుచుఁ జెప్పెదు నామె యోగ్యత నొకండు
చచ్చునెడ వ్రాసినట్టి లక్షల కొలంది
ధనము త్రికరణశుద్ధి వద్దనిచుదువుట॥ 24

గీ॥ తనదు పేరున్న దేశ మంతటను గలహ
మెవ్వరికి లేకయుండఁగ నేలుచుండి
పులియు మేఁకయు నొకచోట జలము త్రాగు
నట్లు గాఁజేసెఁ గాదె రాజ్యంబు నామె॥ 25

గీ॥ రషియనేలెడు రారాజు క్రైస్తవులను
బాధపెట్టెడు తురకలవధ నెపమునఁ
దరిక దేశము చేకొనుట కనుమీఁదఁ
గ్రమముగా నిండియాలోనఁ గాలిడుటకు॥ 26

గీ॥ కపటపుఁదలంపు చేఁ మరుష్క పతిమీఁద
దండయాత్ర వెడలిన వార్తకును రాణి
నిజముగనుఁ గొనుచుఁ దన సైనికుల నెల్లఁ
బంపి పోరాట నోడించె వానినపుడు॥ 27

---

24 ఇతరధనమునకుౘ = ఒరులద్రవ్యమునకు, అపేక్షపడనది = కోర
నియది, త్రికరణశుద్ధిౘ = మనోవాక్కాయశుద్ధిచే, నుదువుట = చెప్పుట.
25 కలహము = విరోధము. 26 రారాజు = రాజులకురాజు, తుర...వము
నన్ = తురకలను జంపుటయనునెపముచే. 27 కప...లంపుచేౘ = చెడ్డయూ
హాచే, దండయాత్ర = యుద్ధప్రయాణము, సైనికులౘ = భటులను, పోరా
టౘ = యుద్ధమునందు.

గీ॥ ఎచట ధర్మంబుగలుగునో యచట, జయము
గలుగుననుటకుఁ దనసైనికులనుజంపు
నట్టి బంగాళ సేనలఁ బట్టఁజేసి
యామె యణఁగించుటయె యిందుదాహరణము॥ 28

గీ॥ మఱియు నెవ్వరికెవరికే మతములుండు
వారువానిని వదలంగ వలదు మా మ
తంబునంగలియుటయు మా తలఁపుగాద
టంచువచియించె రాణి మహాదరమున॥ 29

గీ॥ తాను రాజ్యంబునకువచ్చు తరుణమందె
మంత్రి యిచ్చిన సైనికమరణము గల
పత్రికంజూచి కన్నీరు వాఱదాని
సైనికుమియింపఁ బడెనని వ్రాసెఁగాదె॥ 30

గీ॥ ట్రాన్స్వాలు రణంబు జరగెడునపుడు
సైనికులనెల్ల మిగులఁ బ్రోత్సాహ పఱచి
పర మహీశులగుండెలు పగులునట్లు
జయము వడసెను దామహోత్సాహమొప్ప॥ 31

---

28 తా॥ న్యాయమెక్కడ నుండునో జయమక్కడఁ గలుగు ననుట
కు, రాణి, తన సేనమీఁద నెదుర్కొనిన బంగాళి సేనలను బట్టించి చంపించు
టయే యిందు దృష్టాంతము 29 మహాదరమునన్ = మిక్కిలి ప్రేమతో
30 వచ్చుతరుణమందె = వచ్చినవెంటనే, సైనికమరణము = భటుని చా
వు, పత్రికన్ = కాగితమును. 31 రణంబు = యుద్ధము, పరమహీశుల =
శత్రురాజులయొక్క, జయము = గెల్పు.

## ౩౩. చక్రవర్తిని గారు మన దేశమునకుఁ జేసిన యుపయోగములు.

గీ॥ దేశమందుందునదుల బంధింపఁజేసె
నానకట్టలఁ గట్టించి యన్నిదెసలఁ
బ్రజలకుం బంటకుపయోగ పడెడురీతిఁ
గాల్వలందఱివ్వఁ జేసెనాకారణమున॥ 32

సీ॥ చౌటిచేమునుఁగు నిస్సారపు నేలలు
సన్నధాన్యము పండఁ జాలియుండఁ
దుంగమొలకలకును దొంగవైయొప్పెడు
భూమిని ఫలవృక్షములు జెలంగఁ
బులులు వాసము చేయు పొదలుగల్గెడు భూమి
రెండుపంటలు పండు రీతినుండె
నుప్పునఁబండని యూసరక్షేత్రముల్
చెఱకులు పెఱిగెడు చేలనొప్పె॥

గీ॥ రాచపన్నైనఁ జెల్లఁగ రానిమాన్య
ములు కుటుంబంబులంబోషివఁ గలుగు పైక
మిచ్చునంతటి యవియయ్యె నిలకురత్న
గర్భయనునామ మర్థయుక్తంబునయ్యె॥ 33

---

32 బంధింపజేసెన్ = కట్టించెను, అన్నిదెసలన్ = ఎల్ల దిక్కులను.
33 నిస్సారపు నేలలు = బలములేని భూములు, ఊసరక్షేత్రముల్ = పట్టునేలలు, మాన్యములు = భూములు, అర్థయుక్తము = ప్రయోజనముతోఁగూడినది.

సీ॥ మెఱుపుదివ్వెలుకంబ్బు మిఱుమిట్లు గొనునట్టు
లెల్లదిక్కులయందు నేపుమీఱె
నొకదినంబుననూఱు యోజనంబులు పోవు
పొగబండ్లు లూరూరఁ బోవుచుండెఁ
బరదేశవార్తలఁ బదినిముసములకుఁ
దెచ్చెడుతీగెలు హెచ్చియుండెఁ
బట్టణంబులనీటి బాధలేకుండఁగ
నసిద్ధియుండ్లకు జల యంత్రముండె

గీ॥ ధర్మవైద్యంబుచేసెడు స్థానములును
జాబులం గొని తెచ్చెడు స్థానములును
సకల జాతులవారికిఁ జదువునేర్పు
పాఠశాలలు సర్వెడఁ బెరిగియుండె॥ 34

గీ॥ పయనమన నేప్పు పుట్టించు బాటలెల్లఁ
బాలుపడఁబోసి యెత్తుంగఁ జాలియుండె
నదుల దాటంగ భయమిచ్చు నావలణఁగి
యెల్లతావులను బొగఁదోడ లేపుమీఱె॥ 35

---

34 విద్యు[illegible]దీపము. యోజనంబులు = ఆమడలు, పరదేశవార్తలు = [illegible]దేశ[illegible] సమాచారములు, తీగెలు = (టెలిగ్రాఫు) జలయంత్రము = [illegible], [illegible] = [illegible]యాణము, బాటలు = త్రోవలు, నావలు = పడవలు.

గీ॥ మూఁడుపైసల కమ్మపై ముఖ్యమైన
సంగతులవ్రాసి యెల్లదేశముల కనుపఁ
దగినజాబుల చోటులంతటనుగల్గి
యుండెజనులకు నత్యుపయోగమునను॥ 36

గీ॥ బాలురకు హూణవిద్యన పారశక్తి
గలుగఁగా నన్యవిద్యలఁ గఱపఁబాఠ
శాలలెల్లెడ వ్యాపించె సర్వజనులు
చదువుచుండిరి జ్ఞానంబు గుమురనిపుడు॥ 37

గీ॥ సతులకున్విద్య రామినష్టంబు నెఱిఁగి
జాలివడిరాణి తనదుదేశంబునుండి
బాలికావిద్య యనుకల్పపాదపంబు
బీజముల నంపియిచటకుఁ ప్రీతితోడ॥ 38

గీ॥ ఎల్లయూళులఁ జల్లించి మొలచువాని
మొలకలనుబెంచఁగా వేల కొలఁదిధనము
సంచులను వెచ్చపెట్టుచు స్వల్పకాల
మందెనభివృద్ధికిందెచ్చె నమితకరుణ॥ 39

---

36 అనుపన్ = సంపుటకు, అత్యుపయోగమునన్ = మిక్కిలి యుపకారముగా, 37 హూణవిద్యన్ = ఇంగ్లీషునందు. అపారశక్తి = అంతము లేని సామర్థ్యము, 38 బీజములను = విత్తనములను, 39 వెచ్చపెట్టుచు = ఖర్చుపెట్టుచు, అమితకరుణన్ = మిక్కిలిదయచే.

సీ॥ కన్నెలకు విద్యఁ గఱప వేతనముల
నిచ్చి యొజ్జలనుంచె నిండ్లకరిగి
యబ్బాలికలఁగొని యరుదేర నిత్యంబు
పరిచారికలను నేర్పఱిచె మఱియు
బహువిధంబులఁ గుట్టు పనికత్తెలను బెట్టి
కుట్టు నేర్పించు నా గుణవతులకు
వారి యాటలకు విహారస్థలంబుల
నుయ్యేలలనుఁ గూర్చె యోగ్యముగను

గీ॥ ఏటికొకసారి సేయు పరీక్షలోఁ గృ
తార్థతం జెందు కన్నెల కఖిలభూష
ణములఁ బుస్తకములనంబరములనీయఁ
జేసె నేర్పాటు లహహ యీ చిత్రమేమి ?॥ 40

గీ॥ ఒక్క కానియుఁ జదివెడు నువిదలకును
వ్యయము లేకుండఁగాఁ జేసి యధిక పాఠ
శాలలెల్లెడఁ బెట్టించు సతి మహోప
కారిణిన్ రాణి నుతియింపఁ గాఁదరంబె॥ 41

---

40 కఱపన్ = నేర్పుటకు, వేతనములన్ = జీతములను, కొని యరుదే
రన్ = తీసికొనివచ్చుటకు, విహార స్థలంబులన్ = ఆడుకొను చోటులను,
యోగ్యముగన్ = తగునట్లుగా, కృతార్థతన్ = చేయఁబడిన ప్రయోజనము
కలుగుటను, అంబరములన్ = వస్త్రములను, 41 ఉవిదలకున్ = స్త్రీలకు,
వ్యయము = వెచ్చము, మహోపకారిణిన్ = గొప్ప మేలును జేయుదానిని,
నుతియింపన్ = పొగడఁగా, తరంబె = శక్యమా ?.

గీ॥ తొంటివారికి నెంతగాఁ దోఁచ లేదొ
యంత ప్రియమగునట్లుగ నందఱకును
గాంతలకుఁ దెల్వి వినయంబు గలుగునట్టు
లంతకంతకు స్త్రీవిద్య యధికమయ్యె॥ 42

గీ॥ దీని మూలముగా నిప్పుదేశమందు
నతివలకుఁ బాడుసాహస మణఁగిపోయె
సమసి పోయిన వాదు రాచారములును
శుచియు మతియును ధృతియును శోభఁ జెందె॥ 43

చ॥ అఱువదినాలుగేండ్లు రవియస్తముఁ జెందని రాజ్యమందు నే
కొఱఁతయు లేక భూజనులకున్ సుఖవృత్తులఁ గూర్చుచుండి చె
చ్చెఱఁదన రాజ్యమభ్యుదయ సిద్ధిగఁ జేసియు ధర్మమార్గమే
ర్పఱచిన రాణి పుత్రులను బౌత్రులఁ గూఁతులపుత్ర పౌత్రులన్॥

---

42 తొంటివారికిన్ = మునుపటివారికి, ప్రియము = ఇష్టము. 43 అతివలకున్ = స్త్రీలకు, పాడుసాహసము = చెడ్డచొరవ, సమసిపోయినవి = నశించిపోయినవి, ధృతి = ధైర్యము, 44 రవి = సూర్యుఁడు, అస్తముఁ జెందని రాజ్యమందు [illegible] రాజ్యమందు, సుఖవృత్తులన్ = మంచిస్థితులను, చెచ్చెఱన్ = శీఘ్రముగా, అభ్యుదయసిద్ధిగన్ = వృద్ధిపొందునట్లుగా, పౌత్రులన్ = మనుమలను.

వ॥ పడసి యానందంబునం జూచికొనుచు 1901 వ సంవత్స
రంబున మనయాధునిక చక్రవర్తులగు నెడ్వర్డు చక్రవర్తి
గారికి రాజ్యభారం బొసంగి సకల సంపత్సమృద్ధంబగు
కాలంబున సహస్రమాస జీవినియయ్యు లోకైక పూజ్యు
రాలును సకల జనోపకారిణియు నగు శ్రీ విక్టోరియా
చక్రవర్తిని, కాలధర్మంబు నొందినదని చెప్పటయు వినుట
యు విచారకారణంబైన నామె శాశ్వతకీర్తి శరీరంబున
జీవించి యున్నదనియే సంతసింపఁదగును. మఱియు నిక్కా
రణంబున 45

గీ॥ తనువు శాశ్వతమనినమ్మఁ దగదుకీర్తి
శాశ్వతముగాన దానికి సడ్డ వడుఁడు
ఎంతవారికిఁ గష్టంబు లేనిమరణ
మేనిఁదప్పదు రాణియె యిందుఁదెఱువు॥ 46

ఆ॥ కాన సుదతులార ! కాంచివిక్టోరియా
రాణిగుణములింపు శ్రద్ధతోడ
భర్తృ భక్తి సత్య పరిపాలనంబును
గర్వపడమిఁ జెందఁ గాఁదగుఁగద॥ 47

---

వ॥ ఆధునికచక్రవర్తులు=ఇప్పటి ప్రభువుగారు, సకల... కాలంబు
నన్=అన్నిసంపదలతోఁగూడిన సమయంబునన్, సహస్ర...విని=వేయినె
లలు బ్రతికినది, కాలధర్మంబున్=మరణమును, విచారకారణంబు=దుఃఖ
హేతువు, 45 తనువు=దేహము, తెఱువు=మార్గము. 46 తా॥ కాఁబట్టి,
ఓకాంతలారా! ఈగ్రంథమునందు, రాణిగారిమంచిగుణములను చదివి పతిభ
క్తి, నిజముచెప్పుట, గర్వములేకుండుట, యీగుణములను మీరునేర్చుకొనఁ
దగును.

ఆ॥ ఈమె తనయుఁడిప్పు డేలుచుండెను భూమిఁ
దల్లివలెనె మిగుల ధర్మముగను
దల్లికంటెమిగుల దార్ఢ్యంబు నాయువు
నితనికిచ్చుఁగాత యీశ్వరుండు॥ 48

క॥ పందొమ్మిది వందలమూఁ
డుందగ వర్షములు క్రీస్తు డుంబుట్టురచిం
చెందరుణి ధర్మబోధిని
సుందరముగ సూర్యశాస్త్రి సులభపుశైలిన్॥ 49

ఇది. పరమపవిత్ర హరితసగోత్ర మల్లాద్యన్వయ
ప్రకాశక రామస్వామి శాస్త్రి పౌత్రుండును
శ్రీ రామావధాని పుత్రుండునగు సూర్య
నారాయణ శాస్త్రిచే రచింపఁ
బడిన స్త్రీధర్మ బోధిని

సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ



47 తనయుఁడు = కొడుకు, దార్ఢ్యంబు = బలమును, ఆయువు = ఆయుర్దాయమును.

# ERRATA.

| Pge. | Line. | | | | |
|---|---|---|---|---|---|
| Preface. | 12 | *for* | 'unrivalled alone' | *read* | 'unrivalled and alone.' |
| 6 | 20 | ,, | స్నేహముతో | ,, | ప్రీతితో |
| 7 | 21 | ,, | ఎరగవలయునన్ | ,, | ఎఱగవలయున్ |
| ,, | 23 | ,, | వస్తులను | ,, | వస్తువులను |
| 11 | 5 | ,, | తోడబుట్లువు | ,, | తోడబుట్టువు |
| 30 | 4 | ,, | మెరి | ,, | మేరీ |
| 31 | 2 | ,, | నిహాటియు | ,, | నిటాలియన్ |

